నెహ్రూ బాల పుస్తకాలయం

# గోముఖ యాత్ర


రచన: షీలా శర్మ

అనువాదం : రామకృష్ణ మద్దులూరి

బొమ్మలు : రీనీ కౌర్





నేషనల్ బుక్ ట్రస్ట్, ఇండియా

# గోముఖ యాత్ర

దేవయానీ, ఆదిత్యా తాతగది తలుపులు మెల్లిగా తెరిచి చూసి ఆశ్చర్యంతో తమ కళ్ళను తామే నమ్మలేక పోయారు. యాత్రకు పరుపు చుట్టి తయారుగా ఉంది. ఖర్జూర పండ్ల పొట్లాలూ, పండ్లూ చెల్లాచెదరుగా పడి ఉన్నాయి.

"అరె, ఏమిటి ఇదంతా?"

తాత ఇంటికి ఎప్పటి కంటె ముందు తొందరగా వచ్చేశాడు. హడావుడిగా తన గదిలోకి వెళ్ళి, వెంటనే తిరిగి బయటకు వచ్చాడు. మామూలుగా పిల్లల్ని పలకరించేవాడు. ఇవాళ అదేమీలేదు. ఏదో విచిత్రంగా ఉంది అతని తరహా. ఏదో తీవ్రంగా ఆలోచిస్తున్నట్టున్నాడు.

"విశేషమేమిటో తెలుస్తుంది - ఆయన గదిలోకి తొంగి చూద్దాం" అంది చివరికి దేవయాని.

వాళ్ళు లోపలికి వెళ్లారు. గోడమీద మేకుకు తగిలించిన తాతచొక్కా జేబులు వెతికారు. వారికోసం తెచ్చిన పెద్ద చాక్లెట్ ఒక జేబులోనూ, మరో జేబులో కొన్ని కాగితాలూ కనిపించాయి. కానీ అసలు విషయం ఏమిటో అంతుబట్టడం లేదు వాళ్లకు.

పంచపాళీలో రెండు ఎత్తు పీటలపై కూచొని చిన్నబుచ్చుకొని ఇద్దరూ తాత రాక కోసం ఎదురుచూస్తున్నారు.

ఆయన ఇంటికి రాగానే సహజంగా సంతోషంతో ఎదురు వెళ్లి స్వాగతం చెప్పేవాళ్లు. "ఆశపెట్టిన చాక్లెట్లు ఏవి?" అని ఆయన జేబుల పైకి ఎగబడేవారు. కాని ఈసారి అదేమీ జరుగలేదు.

"ఏం జరిగింది? పిల్లలు ఎక్కడ?" అని తాత ఆశ్చర్యపోయాడు.

పంచపాళి కిటికీలో నుంచి చూస్తే ముఖం ముడుచుకొని కూచున్న దేవయానీ, ఆదిత్యలు కనుపించారు.

"సంగతేమిటి? ఎందుకు ఇక్కడ దాక్కున్నారు?" ఏదైనా అల్లరి చేస్తున్నారా? అని తాత నవ్వుతూ మళ్లీ అడిగాడు.

"ఎవరూ పలకలేదు. మీ మౌనానికి కారణం ఏమిటి?" తాత మళ్ళీ అడిగాడు.

"అయితే మీకు చాక్లెట్ వద్దా?" అంటూ తాత వారి జవాబుకు ఎదురు చూశాడు. జవాబు రాలేదు.

"మీ జేబునుంచి చాక్లెట్ తీసేసుకున్నాము. మీరు చూసినట్టులేదే?" అంది దేవయాని.



"దొంగపిల్లల్లారా! ఇక చెప్పండి, మీరెందుకు చిరచిరలాడుతున్నారు."

అని బిగ్గరగా నవ్వాడు తాత.

"మీపై మాకెంతో కోపంగా ఉంది." అంది దేవయాని.

"ఎందుకు?"

"మాకు చెప్పకుండా మీరెక్కడికో ఉడాయిస్తున్నారు." అన్నాడు ఆదిత్య.

"ఉన్నట్లుండి ఇప్పుడే నిశ్చయమైంది. అదే మీకు చెబుదామనుకొంటూనే ఉన్నాను" అని చిరునవ్వుతో అన్నాడు తాత.

"అయితే తాతా! ఎక్కడికి ప్రయాణం? అది మేము రాకూడని ప్రదేశమా?" అన్నాడు ఆదిత్య.

"గోముఖం పోతున్నా, నేను. అది ఎంతో ప్రయాసతో కూడిన ప్రయాణం. అందుకని మీకు చెప్పలేదు."

"మరి అప్పుడే ఎక్కడికి అంత వేగంగా వెళ్లి వచ్చారు?" అంది దేవయాని.

"టికట్టు కొనుక్కునేందుకు వెళ్ళాను."

"మాకు కూడా ఎందుకు టిక్కట్లు కొనలేదు?" అని గొణిగాడు ఆదిత్య.

ఇద్దరూ తాతను ఒత్తిడి చేశారు. చివరికి ఆయన అంగీకరించాడు.

"సరే, మీకు టికట్లు తెస్తాను. ప్రయాణానికి సిద్ధంకండి. తక్కువ సామాను ఉంటే ఎక్కువ సుఖంగా ప్రయాణం చెయ్యవచ్చును. పర్వతాలు ఎక్కాలి మరి!"

"చూడు తాతా! నా సామాను సర్దికట్టాను. సులువుగా ఉతకడానికి వీలైన వెచ్చని దుస్తులూ, నడవడానికి అనువైన గట్టి తేలిక బూట్లు రెండు జతలూ" అంది దేవయాని సామాను చూపుతూ గర్వంతో.



"చూడు, ఆదిత్యా, ఈ చిన్నారి ఎంత తెలివి కలదో. నువ్వూ అదే మాదిరి తేలికైన వెచ్చని దుస్తులూ, నడిచేందుకు వీలుగా వుండే బూట్లూ సిద్ధం చేసుకో," అన్నాడు తాత.

వెడల్పు మూతి సంచీని తాతకు చూపి, "నా దుస్తులు దాంట్లో ఉంచి భుజానికి వ్రేలాడ దీసుకుంటాను" అన్నాడు ఆదిత్య.

"శభాష్! మనం ఉత్తర కాశీ, అక్కడ నుంచి గంగోత్రి, చివరకు గోముఖం వెళుతున్నాము. మీకు గంగ జన్మస్థానం చూపుతాను. త్వరగా బయలు దేరితే రైలు బండిలో మంచి చోటు దొరుకుతుంది," అన్నాడు తాత.

* * *

ఉత్తర కాశీ ఆదిత్యను బాగా ఆకర్షించింది. తాత తన పాత పర్వతారోహణ పాఠశాలను ఆదిత్యకు చూపించాడు. లావు త్రాళ్లూ, గొడ్డళ్లూ, పగ్గపు నిచ్చెనలూ, ప్రాణవాయు సిలిండర్లూ, డేరాలు మొదలైన సామాగ్రిని ఆదిత్య శ్రద్ధతో పరిశీలించాడు. "తాతా! ఇవన్నీ ఎందుకు?"

"ఎత్తయిన పర్వతాలపై జారే మంచు మీద నడవడం ప్రమాదకరం. అందుకని వీటి అవసరం ఎంతయినా ఉంది."

"నేను పర్వతాలు ఎక్కబోతున్నాను. ఆ సామాగ్రితో నాకెంతో అక్కర ఉంది." అన్నాడు ఆదిత్య.

"కాదు బాబూ, ముందు పర్వతారోహణ నేర్చుకో. నీకు మంచి తర్ఫీదు కావాలి. అప్పుడే పర్వతాలు సునాయాసంగా ఎక్కగలవు."

"ఈ సంస్థ స్థాపకుడు బ్రిగేడియర్ జ్ఞాన్‌సింగు దానికి ఏ పేరు పెట్టాడో మీరు చూశారా?"

ఆ సంస్థ కుటీరపు తలుపు మీద నామఫలకం మీద "భాగీరథీ" అని చదివారు ఆ ఇద్దరు పిల్లలూ.

"తాతా! బ్రిగేడియర్ జ్ఞాన్ సింగ్ ఎవరు?"

'తొలి ఎవరెస్టు పర్వతారోహణకు నాయకుడైన ప్రఖ్యాత భారతీయుడు.'

"హిమాలయ శిఖరాలు" అనే చక్కని పిల్లల పుస్తకం ఆయన రాసిందే. "కుటీరపు

గోడలపై ఉన్న బొమ్మలు ఏమిటి?" అని వారిని తాత అడిగాడు. "నదిలో కొట్టుకు వచ్చిన మానులతో తయారైన బొమ్మలు అవి." అని అన్నారు ఇద్దరూ ఏక కంఠంతో.

"అవును, నదిలో తేలే కఱ్ఱలు ప్రవాహపు రాపిడికి ఏవేవో ఆకారాలూ, రూపాలూ పొందుతాయి. కొద్ది యోచన, కొంత చిత్రిక పనిచేస్తే ఆ అందమైన వస్తువులు తయారయాయి - చూడండి." అన్నాడు తాత.

ఆదిత్య కుటీరాన్ని పరిశీలిస్తుండగా, దేవయాని రోడ్డు ప్రక్క బజారులో తిరుగుతూ తెల్ల కొయ్యతో తయారైన చిల్లర మల్లర వస్తువులనూ, ఆట సామగ్రినీ చూస్తూ ఉంది. ఇంటికి తిరిగి వెళ్లేప్పుడు ఆ వస్తువులు కొన్ని కొనాలనుకుంది. కోటు కోసం నాణ్యమైన ఉన్ని కొన్నాడు తాత.

"గంగలో మునిగి రావాలను కొంటున్నాను" అని చెబుతున్న ఆదిత్యతో "అయితే నా చెయ్యి గట్టిగా పట్టుకో," అన్నాడు తాత. "గాభరాపడకు తాతా! ఈతలో ఆదిత్య మొనగాడు" అంది దేవయాని. "చూశారా! ఎంతవడిగా వుందో ఈ ప్రవాహం" అన్నాడు తాత. "దీనిలో దిగువవైపుగా ఈదడం సులువు. కాని ఒడ్డుకు తిరిగి చేరడం కష్టం. నీళ్లల్లోని శిలలు మనకు కనబడే దానికన్నా చాలా పెద్దవి. తెలియక అవి తగిలితే ప్రమాదం. ఆ నీరు ముట్టుకునిచూడు - ఎంత చల్లగా ఉందో. అబ్బా! అది ఇప్పుడే కరిగిన మంచులాగ జివ్వుమంటూ ఉంది కదూ!"

ఈ నీళ్లలో మామిడి పండ్లను వేసి చల్లగా అయాక తిని చూడండి - ఎంత మజాగా ఉంటుందో. మామిడి పండ్లను గురించి దేవయానీ, ఆ నీటిలో ఈతను గురించి ఆదిత్యా పగటి కలలు కంటున్నారు.

ఆదిత్య తాత చెయ్యి గట్టిగా పట్టుకొని ఆ నీళ్లలోకి అడుగు పెట్టాడో లేదో గబుక్కున బయటకు దూకి "అబ్బ, ఈ నీరు ఎంత చల్లగా వుందో! నేను చలికి గడ్డ కట్టుకు పోబోతున్నాను, తాతా!" అని గట్టిగా అరిచాడు. "ఏదో గొప్ప గజ ఈతగాడిలాగ నీళ్లలోకి పోబోతున్నావనుకున్నాను - జాగ్రత్త! ఈ రాళ్లు కుదురుగా ఉండవు. వాటిపైన కాలు పెట్టినపుడు జర్రున జారుతుంది. ఆ రాళ్లు కూడా కదులుతాయి సుమా!"

ఆదిత్య రెండు మునకలు వేయగానే "చాలు చాలు తాతా! నేను బయటకు వచ్చే

స్తున్నా!" అరిచాడు.

ఆదిత్య ఆ నీటినుంచి బయటికి రావడానికి సాయంచేసిన తర్వాత తాత "త్వరత్వ రగా బట్టలు వేసుకో!" అన్నాడు.

"చూడు-ఆదిత్యా-ఈ పక్షి ఏమిటి ఇట్లాఉంది? ఇలాంటి దాన్ని ముందెప్పుడైనా చూశావా? ఎంత అందంగా ఉందో! దాని నల్లటి కనుకొనల చుట్టూ నారింజ రంగు ఎవరు దిద్దారో చూడు, ఆ కళ్లు లేడి కన్నులంత అందంగా మెరుస్తున్నాయి. దూరంగా ఉన్న ఆ మనిషి పెంచుకునే పక్షిఏమో, అది. చూడు చూడు-ముక్కుతో గింజల్ని పొడుచుకొని తినడానికి ఆపక్షిని వదిలాడేమో!" అన్నాడు ఆదిత్య.

ఆదిత్య బట్టలు తొడుక్కుంటూ ఉండగా "నువ్వు చూసేది ఏ పక్షిని? అదే చకోర పక్షి" అన్నాడు తాత.



"అది చకోర పక్షా?" అంది ఆశ్చర్యంతో దేవయాని.

"ఆదిత్యా! దాని ఫోటో తీయ్ - దాన్ని మాస్కూల్లోని అమ్మాయిలకు చూపిస్తాను. చకోరాన్ని గురించి ఏదో పుస్తకంలో చదివిన గుర్తు. దాని కళ్లు చంద్రుణ్ణి ఎప్పుడూ చూస్తూవుంటాయిట."

"అది నీకెట్లా తెలుసు?" అని ప్రశ్నించాడు ఆదిత్య. "పుస్తకాల్లో చదివిందే నేను చెపుతున్నాను" అంది దేవయాని చిరచిరలాడుతూ.

"ఆ పక్షిని జాగ్రత్తగా చూడాలి. అది కోలంకి పిట్ట కన్నా పెద్దది? కోడికన్నా చిన్నది. పర్వతవాసులు దానిని పెంచుతారు. అది గింజలూ, పురుగులూ, పచ్చిలేత గడ్డి చిగుళ్ళూ, తింటుంది. దాని కళ్లు సొగసైనవి."

"తాతా, ఆ చకోరాన్ని ముద్దుగా పెంచుకుందాం. ఆ పక్షిని మనకు అమ్ముతాడేమో అడుగు."

"పిచ్చిపిల్లా! అది పర్వతవాసి. వేడి మైదానాలలో బ్రతకలేదు. రండి! రండి! మనం చాలా దూరం ముందుకు పోవాలి," అన్నాడు తాత.

బస్సులో ప్రయాణం చేస్తున్నదన్నమాటేగాని దేవయాని మనస్సంతా ఆ చకోర పక్షి మీదే ఉంది.

"అది ఎత్తుకు ఎగరగలదా?తాతా!"

"దాని రెక్కలు చూశావు కదా! బాగా ఎగురగలదు," అన్నాడు తాత.

"అవి బలంగా వేగంగా ఎగిరే పక్షులు" అన్నాడు తాత.

"మమ్మల్ని మీరు తొందర పెట్టారు. దాన్ని ఇంకా తనివితీరా చూడాలని ఉంది," అంది దిగులుగా దేవయాని.

ఇదే ఈ పర్వత ప్రాంతాల ప్రత్యేక ఆకర్షణ. ఎక్కడికి పోయినా ఇంకా, ఇంకా చూడాలనిపిస్తుంది. కాని పగటివేళే జాగ్రత్తగా వంకర టింకర దారుల్లో ప్రయాణం సాగుతుంది. చీకటిపడితే అపాయకరం. మరి క్రూర జంతువుల భయం కూడాను. ఎత్తుకు వెళ్లిన కొద్దీ ప్రభాత సూర్యుడు కాంతివంతంగా ఉంటాడు. మధ్యాహ్నం మూడు గంటలయితే వెలుతురే ఉండక పోవచ్చు. అందుకే తొందరపడాలి.

చకోరాన్ని తలచుకొని పరధ్యానంగా ఉన్న దేవయానితో "నేను మరో అందమైన పక్షిని గురించి చెపుతాను, విను," అన్నాడు తాత.

దేవయానీ, ఆదిత్యా తాత వైపు ఉత్సాహంగా చూశారు. ఆయన ఇలా చెప్పాడు. "మనాల్ అనే పక్షి ఎంతో ఆకర్షణీయమైంది. అది నెమలి కన్నా అందమైనది. ఇతర పక్షులలాగ ఎగరలేదు. దాన్ని తోక పొట్టిగా కత్తిరించినట్టు ఉంటుంది. దాని ఈకలు ఆకుపచ్చగా నీలంగా నిగనిగ లాడుతూ కన్నుల పండుగగా ఉంటాయి."

"దానిని గురించి మాట్లాడుతూ మీరెందుకంత దిగులుగా ఉన్నారు?"

అంది దేవయాని.

"ఒకప్పుడు ప్రతిచెట్టుమీదా ఆ పక్షులు కనిపించేవి. ఇప్పుడు కనీసం ఒకటైనా కని పించడం అదృష్టమే."

"అవి ఇప్పుడు ఎక్కడికి మాయమై పోయాయి?" అంది దేవయాని.

"ఇంగ్లండు వెళ్లాయి." అన్నాడు కనుబొమలు చిట్లిస్తూ తాత. "అవి అన్నీ ఎట్లా వెళ్లాయి? నిజంగానా లేక సరదాకి అంటున్నారా?" అంది దేవయాని.

"అవన్నీ ఎట్లా వెళతాయి? తమ ప్రాంతాలలోనే అవి ఉండి ఉంటాయి తాతా," అన్నాడు ఆదిత్య.

"పాపం! అవేమి చేస్తాయి," అన్నాడు తాత.

"ఇంగ్లీషు వనితలు నెమలి ఫించం లాంటి వాటి ఈకలను తమ టోపీలలో తురాయి లుగా పెట్టుకుంటారు."





"ప్రతి ఇంగ్లీషు మహిళ తన టోపీలో మనాల్ పక్షి ఈకల్ని ధరించడం గొప్పనాగరికత అనుకున్నారు. అందుకే విల్సన్ దొర ఆ వ్యాపారం మొదలు పెట్టాడు. ఆ తరువాత అందమైన పక్షులను చంపి గడ్డి కూరి వాటిని బజారులో అమ్మారు."

"అయ్యో! ఎవరా విల్సన్ దొర?" అన్నాడు ఆదిత్య.

"ఇటు చూడు - ఇదే భాట్వారీ. పక్షుల గొడవలో పడి అంతా మరచిపోయాము. విల్సన్ దొరను గురించి తీరికగా ఉన్నప్పుడు మరెప్పుడైనా చెప్పుతాను," అన్నాడు తాత.

"భాట్వారీ! భలే పేరే?" అంది దేవయాని.

"ఏవస్తువైనా వాడగా వాడగా దాని అంచులు అరిగి నున్నగా అవుతాయి. ఈ రాళ్ళు చూడండి ఎడతెరపి లేకుండా దొర్లిదొర్లి నునుపై మెరుగు పడ్డాయి."

"ఈ సెలయేటిలో అవి మొదట ఇట్లాగే ఉండి ఉంటాయా?"

"లేదు! లేదు! కాలప్రవాహంతో రాళ్లు నునుపుదేరినట్లే మాటల రూపం కూడా మారుతుంది అంతే," అన్నాడు తాత.

"ఏమిటీ!" ఆశ్చర్యంతో పిల్లలు కన్నులు పెద్దవి చేశారు.

"అలాగ ఎందుకు కాకూడదు? మనం మాటలను నాలుకలపైదొర్లిస్తాస. అవీ అరిగి పోతాయి. పామరులు తప్పుగా యాసగా ఉచ్చరిస్తారు. అలాగే "భాస్కర పురి" కాస్తా 'భాట్వారీ' అయింది." పిల్లలు పకపకా నవ్వారు.

"ఆ ప్రదేశాన్ని గురించి ఒక కథ ఉంది. సూర్యుని నామాలలో 'భాస్కర' అనేది ఒక టి. ఆ చోటు దగ్గర సూర్యదేవుడు శివుణ్ణి సంతృప్తి పరచాలని దీక్షపట్టాడు. అక్కడ శివు నికి అంకితమైన దేవాలయం ఒకటి ఉంది. ఇతర యాత్రా స్థలాలలో మాదిరిగానే పూర్వం యాత్రికులు అక్కడ తపస్సు, ధ్యానం చేసినట్లు నిదర్శనాలున్నాయి."

"చూడండి మనం 'గంగనాని' ని సమీపిస్తున్నాము. పూర్వకాలంలో బాటసారులు గంగనాని వద్దనే మజిలీ చేసేవారు. గంగకు అడ్డంగా ఉండే ఉష్ణ గుండాలలో స్నానాలు చేసేవారు."

"ఉష్ణగుండం అంటే ఏమిటి?" అంది దేవయాని.





"ఆ పర్వతాలలో అక్కడా అక్కడా వేడినీటి గుండాలు ఉంటాయి. వాటినీరు అడపాద డపా మడుగుల్లోకి లేక చిన్న సరస్సుల్లోకి ప్రవహిస్తుంది. ఆ పర్వత ప్రాంతాలలో స్నానా లకు అది సదుపాయంగా ఉంటుంది. వేడి నీటి స్నానాలకు ఉష్ణగుండాలు, చన్నీటి స్నానా లకు గంగ ఉన్నాయి. ప్రకృతి అన్నీ ప్రసాదించింది. ఎవరికి ఏది కావాలంటే అదే వాళ్లు అనుసరించ వచ్చును."

గంగనాని చేరగానే ఆదిత్య బస్‌లో నుంచి దూకి ఎకాయెకి గంగ ఒడ్డుకు వెళ్లి వేగంగా నురుగులు గక్కేప్రవాహాన్ని అత్యంత ఉత్సాహంతో చూశాడు.

"అవతలి ఒడ్డున ఒక ఉష్ణగుండం. పరాశరఋషి ఆశ్రమమూ ఉన్నాయి," అన్నాడు తాత.

"అదే వ్యాసమహర్షి జన్మ స్థలంకూడా."

ఆ వ్యాసుని రచనే మహాభారతం. ఇక్కడే శంతనుడు సత్యవతిని వివాహం చేసుకున్నాడు.

"ఓహో! ఆకథ నాకూ తెలుసు. సత్యవతి తండ్రి శంతనునితో 'నా కూతురుకు కలిగే కొడుకే సింహాసనం ఎక్కాలి.' అని అన్నాడు. తన తండ్రి శంతనుని విచారం చూసి భీష్ముడు తాను పెండ్లే చేసుకోనని ప్రతిజ్ఞ చేశాడు." ఇంకా కథంతా రక్తికట్టేట్టు తన తాతకు ఆదిత్య చెప్పుతుండగా మధ్యలో దేవయానికి విసుగుపుట్టి అతని మాటలకు అడ్డుతగిలి - "అవతలి ఒడ్డున వేడి నీటి బుగ్గలు ఎన్ని ఉన్నాయి?" అని అడిగింది.

"సూర్య కుండమూ, వ్యాసకుండమూ అనే రెండు వేడి నీటి బుగ్గలున్నాయి. వాటిని చూస్తుంటే 'సేద తీర్చుకోవడానికి ఇటురండి' అని ప్రకృతి ఆహ్వానిస్తున్నదా- అనిపిస్తుంది. భగీరథీ నది ఒడ్డున ఉన్న పర్వతాలలో ఋషులు నిర్మించిన ఆశ్రమాలు చూడముచ్చటగా ఉంటాయి. ఆప్రాంతంలో పూర్వం ఋషులు చాలా ఆశ్రమాలు నిర్మించారు. మనమంతా వారి వారసులమే, అందమైన ప్రకృతి ఒడిలోని పర్వతాలలో వారు నివసించారు. వారి జనాభా పెరిగి పెరిగి మైదానాలకు వచ్చి స్థిరపడ్డారు. ఈ ఆశ్రమాలకు వస్తే స్వస్థానాలకే వచ్చామనే తృప్తి ఉంటుంది...అరె! మీ తలలు ఊగిపోతున్నాయి - నిద్ర వస్తున్నట్టుంది. కనీసం హర్సిల్ చేరేంత వరకైనా ఆగండి. అది చాలా సుందరమైన స్థలం దానిని కాశ్మీరులోని పహల్గాంవ్‌తో పోలుస్తారు."

అలసి పోయిన దేవయానీ, ఆదిత్యల కన్నులు మూతలు పడడంతో వారు హర్సిల్ దగ్గిర నిద్రపోసాగారు. కొన్ని కాయలూ, పళ్ళూ, కొంచెం తిండీ తీసుకోమని తాత బలవంతం చేశాడు. "శీతల వాతావరణంలో వట్టి పొట్టలతో నిద్రపోకూడదు అన్నాడు తాత."

కాస్త తిండి తిని ఇద్దరు పిల్లలు నిద్రపోయారు. హార్సిల్ తొలకరి వానజల్లులూ, పర్వత శిఖరాలలో తొలి మంచూ కురవడం మొదలయింది. కిటికీలో నుంచి బయటి ప్రభాతాన్ని ఆదిత్య ఉత్సాహంతో చూసి, దేవయానిని నిద్రలేపి "అటు చూడు, మంచుతో నిండిన ఆ అద్భుత శిఖరాన్ని" అన్నాడు.



బంగారు కాంతులతో సూర్యుడు ప్రకాశిస్తున్నాడు. ఆదిత్య ఒక గొర్రెల మందను చూసి వాటితో ఆడుకునేందుకు పరుగులెత్తాడు. గొర్రెల కాపరిని అడిగి ఒక గొర్రె పిల్లని చేతిలోకి తీసుకొని, వాని వెంట నడుస్తూ -

"మీ రెందుకు ఆ గొర్రెపిల్లల్ని నేలమీద నడవనియ్యరు?" అన్నాడు.

కొండల్లో, మారుమూల ప్రాంతాలలో గొర్రెల కాపర్లు మాట్లాడే భాష వేరుగా ఉంటుంది.

“ఆ మందలు చాలా దూరం నడవాలి. కనుక గొర్రె పిల్లలకు అది అలసట కలిగించే పని.” అని చేతులు తిప్పుతూ సైగలు చేస్తూ చెప్పాడు గొర్రెల కాపరి.

తమ్ముడి దగ్గరకు పరుగెత్తే దేవయాని గొర్రెల కాపరిని చూసి భయంతో తాత చెయ్యి గట్టిగా పట్టుకొని “అతని జడలు కట్టిన జుట్టూ, బవిరి గడ్డం చూస్తే భయం వేస్తోంది.” అంది.

“అక్కడ వారిని ‘గద్దీలు’ అంటారు. ఎత్తయిన పర్వతాల పై మంచు పడడం మొదలు కాగానే ఆ ప్రాంతంలోని గొర్రెల్ని దిగువ సానువుల్లో మేపడానికి తోలుకొని వస్తారు,” అన్నాడు తాత.



"తన గొర్రెలే కాక ఇతరులని కూడా ఎందుకు దిగువకు తోలుకొని వస్తాడు?" అడిగింది దేవయాని.

"దాని వలన అతనికి లాభం ఉంది. వాటిని మేపి నందుకు ఒక గొర్రె పిల్లను ఇస్తారు. వాళ్లు డబ్బు ఇచ్చినా తీసుకోడు. ఆవిధంగా అతను తన సొంత మందను వృద్ధి చేసుకుంటాడు. ఆ కొండల్లో గొర్రెలూ, మేకలూ ఉంటేనే సంపద."

కానీ డబ్బు నయం కదా! "కుతూహలం ప్రకటించింది, దేవయాని.

"వారు డబ్బుతో ఏమి చేసుకుంటారు? తినడానికి ఏమీ దొరకనప్పుడు డబ్బున్నా ప్రయోజనం ఏముంది? గొర్రెల పాలూ, మేకల పాలూ త్రాగడానికీ, వాటి ఉన్ని కంబళ్లకూ, వాటి తోలు రగ్గులకూ ఉపయోగపడతాయి. ఆ జంతువులంటే వాళ్లకెంత ప్రాణమో, విలువో ఇప్పుడు ఊహించు. ఎవడికి ఎంత పెద్ద మంద ఉంటే అతనికి అంత మోతుబరి. ఆ కొండల పైన ఉండే 'గద్దీలు' మన మైదానాలలోని గొర్రెల కాపరుల లాంటి వాళ్లు."

"అయితే ఇప్పుడు అతనంటే భయం పోయింది," అంది దేవయాని.

"నాగరికతకు దూరంగా ఎత్తయిన అరణ్యాలలో ఉండడం చేత వాళ్లు మురికిగా అసహ్యంగా ఉంటారు. దేశద్రిమ్మరులు ఆరుబయట ఎండల్లో తిరగడంచే మోటుగా ఉంటారు. అతణ్ణి సమీపిస్తే అతనెంత సౌమ్యుడో, కనికరం కలవాడో అర్థమవుతుంది. అందు చేతనే అతనితో మాట్లాడడం, తిరగడం అంటే ఆదిత్యకు సరదా."

అప్పుడు తాత పిల్లల్ని ఒక యాపిల్ తోటకు తీసుకు వెళ్లి, 'భారత దేశంలో నాటిన తొలి యాపిల్ పండ్ల తోట ఇదే. ఇక్కడ పండ్లు చిన్నవైనా మంచి గుజ్జుతో తియ్యగా రుచిగా ఉంటాయి.' అన్నాడు.

"ఆ పండ్ల తోటను ఎవరు నాటారు?" అడిగింది దేవయాని.

"మొదట వంద యేండ్ల క్రిందట విల్సన్ దొర ఆ చెట్లను ఇంగ్లండు నుంచి తెచ్చి నాటాడు."

శీతల వాతావరణంలో యాపిల్ చెట్లు బాగా పెరుగుతాయని ఆయనకు తెలుసు. ప్రస్తుతం ఇక్కడ యాపిల్ తోటలు చాలా ఉన్నాయి. అందులో మేలు రకం ఏపిల్స్ పండిస్తున్నారు.

"అతను మన దేశానికి కొత్తగా ఇంకేమైనా చెట్లు తెచ్చాడా?" అంది దేవయాని. "ఔను! అవి లేనిదే మనం చపాతీలు తినలేము!" అని చిన్నగా నవ్వాడు తాత. "బంగాళా దుంపలు!" అన్నాడు ఠకీమని ఆదిత్య.

"భేష్, సరీగ్గా చెప్పావు." అన్నాడు తాత. ఇపుడు బంగాళా దుంపలను మనం కోకొల్లలుగా పండిస్తున్నాము. కొండల్లో అదే ముఖ్యమైన ఆహారం. మొదట జనం వాటిని అక్కడ నాటడాన్ని వ్యతిరేకించారు. క్రమేణా వాళ్లకు నచ్చచెప్పడానికి విల్సన్ దొర బంగాళా దుంపల సాగుకు దోహదం చేశాడు."

"బంగాళా దుంపల్ని ప్రత్యేక పద్ధతిలో సాగుచేయాలి. కాలువలు త్రవ్వి వాటిని మట్టిలో కప్పి పెట్టాలి. గోధుమలూ, మరి ఇతర ధాన్యాల లాగ నాటితే అవి ఫలించవు," అన్నాడు ఆదిత్య.

"విల్సన్ దొర పిట్టల్ని చంపడంలోనే పేరు పొందాడనుకుంటున్నాను. మరి ఆయన కొన్ని మంచి పనులు కూడా చేశాడన్నమాట," అంది దేవయాని.

"తనకు తోచిన రీతిలో, తన తెలివి తేటలతో ఈ పర్వత వాసులకు మరో గొప్ప మేలు చేశాడు విల్సన్."

"ఏమిటి?" అన్నారు పిల్లలు.

"పైకి నడుస్తూ ఉన్నప్పుడు గంగమీద ఏదైనా తేలుతూ ఉండడం మీరు గమనించారా?"

"కొయ్య చెక్కలు! ఆయనే ఆ పనీ చేశాడా?"

"ఔను! ఎంత సులువుగా ఆ కొయ్యల్ని పర్వత కింది భాగాలకు తెచ్చాడో మరి, ఊహించండి."

"ఆ పెద్ద బరువైన కొయ్యల్ని అంతకు ముందు మనుష్యులు తమవీపులపై అతికష్టంతో మోసుకొని తెచ్చేవారు. కాని అవే గంగమీద తేలుతూ మైదానాలకు చేరేసరికి బాగా గట్టిగా వెంటనే ఉపయోగించడానికి వీలుగా తయారు అవుతాయి."

"ఆయన మరి ఇంకా ఏమేం చేశాడు, తాతా?"

"వ్రేలాడే వంతెన మీరు చూశారా?"

రెండు పర్వతాల మధ్య ఒక పెద్దతాడు కొయ్య పలకలతో వ్రేలాడుతూ ఉంటుంది. ఒక్కొక్క అడుగు వేసినప్పుడల్లా ఆ చెక్కలు అటూ ఇటూ ఊగుతుంటాయి. అయితే అల వాటు పడగా పడగా ఆ వంతెన మీద ఒక ప్రక్కనుంచి మరో ప్రక్కకు సులువుగా దాట వచ్చును."

"సరదాగా వుంటుంది కదూ!" పిల్లలు నవ్వుతూ చప్పట్లు కొట్టారు.

"మొదట్లో ఈ వంతెనల మీద దాటడం జనానికి భయంగా ఉండేది. అయితే విల్సన్ దొర వారికి ధైర్యం కలిగించాడు.



ఈ పర్వతాలలో "ఒక చోటినుంచి మరొక చోటుకి వెళ్లడానికి పొట్టి గుర్రాల నుపయోగించేవారు. అవి లోతైన కొండ చరియల్లో, ఇరుకు దారుల్లో సునాయాసంగా నడవగలిగేవి. విల్సన్ దొర ఒక పొట్టి గుర్రం మీద స్వయంగా ప్రయాణం చేశాడు. ఆ వేలాడే వంతెనల మీద అటూ ఇటూ తన గుర్రాన్ని దౌడు తీయించి ప్రజలలో ఉత్సాహం, విశ్వాసం రేకెత్తించాడు."

విల్సన్ దొర చేసిన సాహసకృత్యాలు విని దేవయానీ, ఆదిత్యలు ఎంతో ముగ్ధులయ్యారు.



"ఒంటరి పాటుగా ఉండే ప్రదేశాలలో ఈ వ్రేలాడే వంతెనలు ఇప్పటికీ వాడుకలో ఉన్నాయి," అన్నాడు తాత.

"విల్సన్ దొర ఇంగ్లీషు వాడా?" అని ఆదిత్య తరువాత అడిగాడు.

"అతను ఈస్టు ఇండియా కంపెనీలో పనిచేశాడు. తన పర్యటనలలో ఈ ప్రాంతం చూసి పరవశుడై ఇక్కడే స్థిర పడాలని నిశ్చయించుకున్నాడు-ముఖ్‌బా అనే ఊరిలో ఉండే పల్లెటూరి పిల్లను వివాహం చేసుకున్నాడు. ఆయా ప్రదేశాలల్లో పర్యటన చేసేటప్పుడు మజిలీలు చేయడానికి వీలుగా అరణ్యాలలో విశ్రాంతి భవనాలు నిర్మించాడు. మనోహరమైన ప్రదేశాలలో కట్టిన ఆ భవనాలని ఇప్పటికీ మీరు చూడవచ్చు."

"ఎంత ధనం ఉంటే అతను వాటి నన్నిటినీ నిర్మించ గలిగాడో!" అన్నది దేవయాని.

"ఔను, మరి. డబ్బు తక్కువయితే పని వాళ్లకు తన సొంత నాణాలు ఇచ్చేవాడు. అవి మామూలు సర్కారు నాణాలతో బాటు చెల్లేవి. ఇలాంటివి మనకి అక్కడా అక్కడా తటస్థ పడతాయి. చీకటి పడబోతోంది. ఇంటికి పోదాం రండి."

అరణ్య విశ్రాంతి భవనం దగ్గరికి రాగానే తాత ఆగి "ఈ బంగళా శిలాఫలకం మీద అది 1864 లో నిర్మించినట్లు వుంది. అయితే అది ఎంత పురాతనమైనదో చెప్పగలరా చూద్దాం, మీ గణిత జ్ఞానం! ఇది ఎంత అద్భుతంగా ఉందో పరీక్షిద్దాం!" అన్నాడు తాత. ఆదిత్య ప్రశ్నల వర్షం కురిపిస్తున్నాడు.

"తాతా! ముఖబా గ్రామం ఎక్కడ?"

"ఈ ప్రాంతంలో ఎత్తయిన కడపటి గ్రామం ముఖ్‌భా. గంగోత్రి పురోహితులు ఇక్కడే ఉంటారు. గంగోత్రి మంచుతో కప్పబడగానే అక్కడ గంగపూజ చేస్తారు."

"అసలు దాని పేరు ముఖ్‌మఠ్. పూర్వం మాతంగ మహర్షి, మార్కండేయ ఋషి అక్కడే తపస్సు చేశారు. ఇక్కడ దేవాలయం ఉంటే-మరి అక్కడ గంగపూజ ఎట్లా చేస్తారు?" అన్నాడు ఆదిత్య. "మంచుతో ఆ దేవాలయం కప్పబడక ముందే దీపావళినాడు గంగా దేవతా విగ్రహాన్ని పల్లకీలో ఉంచి ముఖ్‌భాను తెస్తారు. ఆ రోజు దేవాలయం దగ్గర దృశ్యం పెండ్లి కుమార్తె పుట్టిల్లు వదలి వెళుతున్నట్లు ఉంటుంది. తెల్లవారినది మొదలు



విల్సన్ దొర

గుంపులు గుంపులుగా జనం గుమికూడి అశ్రు నయనాలతో ఆ దేవత త్వరగా తిరిగి రావాలని ప్రార్థిస్తూ పల్లకీ వెనకాలనడిచి వెళతారు," అన్నాడు తాత.

"ముఖ్‌భా మునుపు అందరికీ ప్రీతి పాత్రమైన, సందడితో ఉండే పట్టణం. మరి అది టిబెట్‌తో వ్యాపార కేంద్రం కూడాను."

హర్సిల్ దానికి ముఖద్వారం. దీని ద్వారా విలువైన రత్నాలూ, దుప్పట్లూ, రత్నకంబళ్లూ, శాలువల వ్యాపారం జరుగుతుంది. అందమైన రంగుల కంబళ్లు, మంచి ఉన్నితో నేయడం చేత వెచ్చగా హాయిగా ఉంటాయి. దిగుమతి చేసుకొన్న ఉన్నిని కూడా స్థానికులు వడుకుతారు. టిబెట్‌కు ఇదే వ్యాపార మార్గం. అక్కడ దానికి బదులు ఇప్పుడు ఏమి ఉందో ఊహించండి!"





“సైనిక స్థావరం” అన్నాడు ఆదిత్య తడుముకోకుండా.

“అవును, అవును. ఆ రాట్నాలూ, మగ్గాలూఇప్పుడు దుమ్ము కొట్టుకు పోతున్నాయి.

అయితే అందమైన రంగుల రత్నాలూ ముత్యాలూ అక్కడ దొరుకుతాయి కదా! - నాకు కొన్ని తెచ్చిపెట్టండి.” అంది దేవయాని, తన మెళ్లో కంఠహారం చూసుకుంటూ.

మర్నాడు తెల్లవారు ఝామున వారు గంగోత్రికి బయలు దేరారు. యాత్ర సందర్భంలో గంగ దిగువగా ప్రవహిస్తుందని తాత చెప్పాడు. “జహ్ను ఋషి ఆశ్రమం పేరుతో అక్కడ నదిని ‘జాహ్నవి’ అంటారు. దానిని గురించి పురాణాలలో ఒక కథ ఉంది.”



"పురాణాలంటే ఏమిటి?" అడిగింది దేవయాని. "అత్యంత పురాతనమైన పవిత్ర గ్రంథాలు. వాటిలోని కథలలో కొన్ని అతిశయోక్తులు ఉంటాయి. మీకు తెలుసు కదా! గంగా నది ఒకానొకప్పుడు జహ్ను ఋషి ఆశ్రమం గుండా ప్రవహించిందని ఒక కథలో ఉంది. భయకంపితులైన ఆశ్రమ వాసులు మునిగి పోతున్నామని గగ్గోలు పెట్టారు. జహ్నుఋషి ఆ నీటిని త్రాగి, తన తొడగుండా బయటికి నీటిని వదలాడు. అందుకే అక్కడి గంగను జాహ్నవి అంటారు. ఆ చోటును ఇప్పుడు జంగ్లా అని పిలుస్తారు."

"తాతా! అది ఒక కథ మాత్రమే. అయితే నిజం ఏమిటి? జహ్నుఋషి నిజంగా గంగను త్రాగాడా?" అన్నాడు ఆదిత్య.

"సరిసరి, ఆదిత్యా - నేను అప్పుడు లేనుకదా! ఏంజరిగిందోమరి! నిజంగా ప్రకృతిలో ఎన్నో వింతలు జరుగుతుంటాయి. జహ్నుని ఆశ్రమం దగ్గర గంగ పర్వతంలో క్రింది భాగం నుంచి ప్రవహిస్తున్నట్లున్నది. ఆ పర్వతంలో పగులన్నావుండి ఉండాలి లేక గంగ వేగం ఎక్కువై ఆ ప్రవాహం ఆశ్రమం లోనికి ప్రవేశించయినా ఉండాలి లేక జహ్నుఋషి పర్వతంలో కొంతభాగం పగలకొట్టడం వలన ప్రవాహం గంగోత్రి గుండా గంగలోకి ప్రవహించి అయినా ఉండాలి. ఆవిధంగా ఆ ఆశ్రమాన్ని రక్షించుకున్నారు."

"అయితే జహ్నుఋషి తొడనుంచి గంగ ప్రవహించిందని కథలో ఉంది కదా. దాని అర్థం ఏమిటి?" అన్నాడు ఆదిత్య.

"దానిని వివరిస్తాను విను. ఆశ్రమం ఒక వ్యక్తి అనుకుంటే దాని పైభాగం తల, మధ్య బాగం నడుము, దిగువభాగం తొడలు, ఇక్కడ గంగ మలుపు తిరిగింది. కనుక దీనినే జహ్నుని తొడనుంచి గంగ బయటకు వచ్చిందని అంటారు."

"ఆ పర్వతానికి దిగువన ప్రవాహ వేగంతో త్రుళ్ళింతలిడుతూ ప్రధాన నదిలో కలుస్తుంది. జాహ్నవి అని పిలిచేది వాస్తవంగా ఈ చోటునే. అయితే ఇప్పుడు 'జాహ్నవి' అనేది గంగకు మరొక పర్యాయ పదం అయింది."

తాత మాటలు వినకుండా, దేవయాని "జాహ్నవిలో ఎండుకొయ్యలు ఎందుకు తేలుతాయి?" అని అడిగింది.

కొన్ని కొయ్యల్ని ఒడ్డుకు లాక్కొచ్చింది. "జాగ్రత్త - జారిపడిపోతావు!" అన్నాడు తాత.

దేవయాని ఆ కొయ్యని వాసన చూసింది. "ఎంత మంచి వాసన!" "ఔను, అది పద్మ చెట్టు కొయ్య, దానికి గొప్ప సువాసన ఉంటుంది."

"ఈ కొయ్య ముక్క పక్షిలాగే ఉన్నది. ఇంటికి తీసుకొని పోయి దానిని జాహ్నవీ నది దగ్గర నుంచి తెచ్చానని ఎప్పుడూ గుర్తు చేసుకుంటూ మురిసిపోతాను."

ఇంకా కాస్త దూరం పోగానే ఆదిత్యను చిన్నగా తట్టి "అదే వ్రేలాడే వంతెన! చూడూ! తీవ్రంగా గర్జిస్తూ ఇరుకైన ముఖద్వారం దగ్గర నుంచి నది ఎట్లా పరుగెత్తుతున్నదో! బాబోయ్! ఆ వంతెన దరిదాపుకైనా పోనేపోను!"



"నేను పోతాను! నీ వంటి వాళ్ల భయం పోగొట్టడానికే విల్సన్ దొర గుర్రం మీద దౌడు తీస్తూ వంతెన దాటాడు. అవతలివైపు పోవడానికి అంతకన్నా మరో మార్గం లేదు కదా! ప్రతి చోటా మంచి వంతెనలు ఉండవు కదా మరి?" అన్నాడు ఆదిత్య.

"ఇవి చీర్‌పైన్ అనే దేవదారు చెట్లు, వీటి నుంచి ఒక ద్రవం లభిస్తుంది. ప్రమానులపై గాట్లు పెట్టి వాటి క్రింద డబ్బాలు వ్రేలాడ దీస్తారు. మెల్లిగా రసం కారుతుంది. తర్వాత పెద్ద డబ్బాలలో దానిని ప్రోగుచేస్తారు. అది ఎంతో ఉపయోగకారి. అది రంగుల తయారీలో పనికి వస్తుంది. ఆ పనీ విల్సన్ దొర ఆరంభించిందే."

చుట్టూ ఎన్నో తెలియని వస్తువులనూ, పరిసరాలనూ చూస్తూఉంటే దేవయాని మనసులో ఎన్నో సందేహాలూ, ప్రశ్నలూ పెల్లుబికి వస్తున్నాయి. "ఏమిటో తాతా! ఇక్కడ పొలం చిన్న చిన్న మడులుగా ఉన్నదేమిటి?" అంది దేవయాని. "చూడు, దేవయాని! ఇక్కడ పొలాల కోసం పర్వత సానువులను మెట్లు మెట్లుగా చదును చేశారు. చూ

డు, పొలాలు ఎంత పచ్చగా నవనవలాడుతున్నాయో!"

"వారు ఏ పంటలు పండిస్తారు, తాతా?" అన్నాడు ఆదిత్య.

"వరి, నువ్వులు, రాందానా, మొక్కజొన్న" అన్నాడు తాత.

"గంగోత్రికి దోవ సాఫీగా వెడల్పుగా ఉంది. ఆ ప్రదేశమూ, చెట్లూ అంటే నా కెంతో ఇష్టం. చూడు, ఆ పావురాలను!" అని చప్పట్లు చరుస్తూ దేవయాని గంతులు వెయ్యడం మొదలుపెట్టింది.

"ఆదిత్యా-చూడు పావురాల గుంపు చెట్లపై వలయాకారంగా ఎగురుతున్నాయి." అది చూసి పిల్లలు సంతోషించారు. అంత చల్లని ప్రాంతంలో పావురాలు ఎలా ఉండ గలిగా యి?

"పావురాలు చాలా దూరం ఎగిరి పోగలవు. ఎంతదూరం పోయినా అవి తిరిగి ఇంటికి వెళ్లేదారి మాత్రం తప్పవు. అవి వార్తాహరులు. సందేశాలను దూర ప్రాంతాలకు తీసుకొని వెళ్ళి మళ్లీ ఇల్లు చేరగలవు."

"తాతా! అదేం చెట్టు?" అడిగింది దేవయాని.

"అవి దేవదారు వృక్షాలు. ఎత్తయిన పర్వత ప్రాంతాలలోనే పెరుగుతాయి."

"నాతో మాట్లాడాలని ఆ చెట్లు ఆతురత పడుతున్నాయా అనిపిస్తుంది. వాటితోనే ఉండి పోవాలని వుంది తాతా!" అంది దేవయాని. నాకూ అలాగే అనిపిస్తూంది. నేనొక కవిని అయినట్లు, ఇక్కడే వుండిపోవాలనీ, ఈ చెట్లు, పక్షులు, రాళ్లు నాతో మాట్లాడు తున్నట్లు అనిపిస్తూంది. ఒక్క ఆకుని తుంచడం కూడా హింస అనుకుంటాను,"అన్నాడు తాత.

"తాతా! నిజంగా నీవు కవి లాగే కనబడు తున్నావు" అన్నాడు ఆదిత్య.

ఇట్లా మాట్లాడుతూ, తాతా ఆదిత్య, దేవయానీ గంగోత్రికి సమీపంగా పోతున్నారు.

"మన ముందున్న దేవదారు కొమ్మని చూడండి. అది ఈ యేడు విరగడం ఖాయం," అన్నాడు తాత.

"అవునవును. అది చాలా క్రిందికి వంగింది. మంచుపడితే ఆ కొమ్మ బరువు ఎక్కువ అవుతుంది కదా మరి!" అన్నాడు ఆదిత్య.

"ఇక్కడ చెట్లు ఎంత అందంగా ఉన్నాయంటే వాటిలో ఒక కొమ్మ విరిగినా నేను బాధతో విలవిలలాడి పోతాను."

"ఇదేమి చెట్టు తాతా?" అంది దేవయాని.

"దీన్ని గయుడు అంటారు. ఇది ఈ ప్రాంతపు రావి చెట్టు. జనం దీనిని పూజిస్తారు. దీని ఆకులు కూడా రావి ఆకులులాగే ఉంటాయి."

"రాతి భూముల్లో దీని మ్రాను అంత వెడల్పుగా పెరగదు. ఇదిగో, వాతావరణం చల్ల బడుతూ ఉంది. సూర్యాస్తమయం కావస్తున్నది. భాగీరథీ నది మీద కొయ్య వంతెన దాటి అరణ్య వసతి గృహానికి పోదాం పదండి."

"అబ్బా! ఎంత వేగంగా ప్రవహిస్తున్నదీ భగీరథీ నది! ఇంత పైదాకా దాని నీటి తుంపర్లు పైకి లేచి పడుతున్నాయి."

*　　　*　　　*

చీకటి పడింది. ఇద్దరు పిల్లలు నిద్రకుపక్రమించారు. తెల్లవారే సరికి గంగోత్రిని చూడాలని కుతూహలంతో ఉన్నారు. వెలుతురు రాగానే చౌకీదారు మంటవేశాడు. కాని చలికి వాళ్లు గజగజ వణుకుతూ బయటకు రాలేక పోయారు. కిటికీలు కూడా మంచుతో కప్పి వున్నాయి. బాగా ప్రొద్దు ఎక్కేదాకా వేచి ఉండి సూర్యుడు పైకి రాగానే వాళ్లు సన్మిత్రుడు తమను పిలిచి నట్లుగానే భావించి ముందుకు ఉరికారు. నీలి ఆకాశం, గంభీరమైన దేవ దారు వృక్షాలూ, గలగల లాడే కాంతులు వెదజల్లే భాగీరథీ జలం, కేసరి రంగు దుస్తుల సాధువులూ - అదెంతో మనోహరమైన దృశ్యం. "ఈ దారిన పోదాం. చూడు. ఆ ముచ్చటైన రాతి భవనం!" అని దేవయాని చెయ్యిపట్టుకొని ఆదిత్య అన్నాడు.

"అది ఇల్లుకాదు. అదొక గుహ" అన్నది దేవయాని. అది ఖాళీగా ఉన్నదనుకొని వాళ్లిద్దరూ అందులోనికి వెళ్లారు. అయితే లోపల కణకణలాడే నిప్పు కుండ ముందు ఒక సాధువు కూర్చుని ఉన్నాడు. దేవయాని ఇక ముందుకి అడుగువెయ్యలేదు. ఆదిత్య సాధువుకి నమస్కరించి వెళ్లి అతని ప్రక్కన కూచున్నాడు. సాధువు ఆదిత్యను ఆశీర్వదించి కొన్ని ఖర్జూర పండ్లు ఇచ్చాడు. ఆదిత్య జంకువదిలి, "బాబాజీ! మీరు వస్త్రాలు ధరిం

చరేం? చలిగా లేదా? ఇక్కడ ఇలాగ ఉంటే భయం వెయ్యదా?" అన్నాడు.

"నాకు ఇలా జీవించడమే ఇష్టం. మంచు కురుస్తున్నా ఇక్కడే ఉంటాం! నాకు చిన్న నిప్పు సెగడు ఉన్నాది. మరి దేనిని గురించి భయపడాలి? దేవుడు అంతటా ఉన్నాడు," అన్నాడు సాధువు.

ఆదిత్యకు ఇదేమీ అర్థం కాలేదు. "దేవుడు మాతోనే ఉన్నాడు," అన్నాడు మళ్లీ సాధు వు.

ఆశ్చర్యం చెందిన ఆదిత్య దేవయానులు ఒకరి నొకరు చూసుకున్నారు. "దేవుడు మీతోనే ఉన్నాడా?" అని ప్రశ్నించాడు ఆదిత్య.

అంతలో తాత పిలుపువిని సాధువు దగ్గిర శలవు తీసుకుని ఖర్జూర పండ్లు నము లుతూ వారు బయటకు పరుగెత్తారు.

"ఏగుహలోకి మీరు మాయమయ్యారు? ప్రతి గుహలోనూ ఎవరో ఒక సాధువు ఉంటా డు. ఇది సాధువుల క్షేత్రం." అని చెప్పి తాత వారిని గంగోత్రి చూడడానికి తీసుకొని వెళ్లాడు.

"గంగ ఒడ్డున ఆ తెల్ల రాయి చూశారా? ఇదే భగీరథి కొండ. ఇక్కడే భగీరథుడు తపస్సు చేసేవాడు."





"తపస్సు అంటే ఏమిటి?" అన్నాడు ఆదిత్య.

"మనసు చెదిరిపోకుండా ఏకాగ్రతతో ఉండమే తపస్సు. మనిషి ఒక దానిలో పూర్తిగా నిమగ్నుడైతే పరిసరాలను లెక్కచేయడు."

"ఈ రకపు పట్టు విడవని దీక్షయే శాస్త్రపరిశోధనకు కూడా మూలము. ఏకాగ్రతకు పర్యాయ పదమే భగీరథుని తపస్సు. దేహాన్ని, ఆత్మనూ ఒక కార్యంలో ఎవరైనా నిమగ్నం చేస్తే వారి దృఢ దీక్షను భగీరథుని తపస్సుతో పోలుస్తారు."

దేవయాని తన చేతిని గంగలో ముంచి "అబ్బ! నీరు ఎంతో చల్లగా ఉంది, తాతా. ఇక్కడ నది వెడల్పుగా ఉంది కదూ!" అంది.

"ఒకప్పుడు జైపూర్, గ్వాలియర్, ఇండోర్, టిహ్రీ మొదలైన రాష్ట్రాల పరిపాలకులు గంగా తీరాన్నే అందమైన రేవులు నిర్మించారు. అయితే ఒక ఏడాది దేవనదికి వచ్చిన వరదల్లో అవన్నీ కొట్టుకొని పోయాయి. దేవాలయం బాగా శిథిలమైంది. ఇప్పుడు దానిని మళ్ళీ నిర్మించాలి."

"తాతా! అక్కడ అంత పెద్ద వరదలు వస్తాయా!" అన్నాడు ఆదిత్య. "కొన్ని సార్లు పెద్ద వానల వల్లా, హిమానీ నదముల వల్లా బ్రహ్మాండమైన వరదలు వస్తాయి."

"తాతా! హిమానీ నదములు అంటే ఏమిటి?"

"అవి మంచు నదులు."

"తాతా! ఇక్కడ నుంచి భాగరథీ గంగీగ ప్రవహిస్తుందన్నావుకదా! మరి గంగ జన్మస్థలం ఎక్కడ?" అంది దేవయాని.

"భాగీరథ చక్రవర్తి ఇక్కడి నుంచే గంగను ప్రవహించేలాగ చేశాడని కథ. అయితే గంగ తిరోగమనం ఇక్కడ నుంచే అని జనం అంటారు. దాని పుట్టుక గోముఖమునకు అవతల పన్నెండు మైళ్ల దూరాన ఉన్నాది. తీరా గోముఖాన్ని సమీపిస్తే అక్కడ గంగ పుడుతూన్నట్లు తోచదు మరెక్కడి నుంచో వస్తున్నట్లు అనిపిస్తుంది."

"తాతా! భగీరథుని తపస్సు గురించి చెప్పవూ?" ఆ కథ రాత్రి చెప్పుతాను. దేవాలయ గంటలూ, మరి జే గంటలనూ వినండి. హారతి వేళ అయింది. గంగ గుడికి మనం పోదాం. అక్కడికి చాలామంది సాధువులూ, మునులూ సాయంకాలపు పూజకు ఎప్పుడూ వస్తూ ఉంటారు.



"పంధొమ్మిదో శతాబ్దంలో జనరల్ అమర్ సింగ్ థాపా ఈ దేవాలయాన్ని నిర్మించాడు. అక్కడ ఒక కొయ్య దేవాలయం ఉండేది. దానిని నిర్మించిన కాలం గురించి ఒక తామ్ర శాసనం ఉంది," అన్నాడు తాత.

"తామ్ర శాసనం అంటే ఏమిటి?" అన్నాడు ఆదిత్య.

"నీకు రాగి అంటే ఏమిటో తెలుసు కదా!"

"ఔను."

"మరి శాసనం అంటే ఏమిటే?"

"చెక్కిన వృత్తాంతం," అంది దేవయాని.

"ఇప్పుడు నాకు అర్థమైంది. రాగి రేకుల మీద చెక్కిన మాటల్ని తామ్ర శాసనం అంటారు. ఆ శాసనం వల్ల ఏం తెలుస్తుంది తాతా?" అన్నాడు ఆదిత్య. "దానిని నేను చదవలేదు. అయితే అది క్లుప్తంగా ఇలా చెప్పుతుంది."

"మాకు విధేయులుగా ఉండండి. గంగ విగ్రహాన్ని గుడిలో ఉంచి ఆరాధించండి" అని. "మాకు విధేయులుగా ఉండిండి" అని ఎందుకు వ్రాశారు? ఇక్కడ గంగకు మాత్రమే పూజ చేయాలి కదా?" అన్నాడు ఆదిత్య.

"నిజమే, మరి! అయితే గంగోత్రి గూర్ఖాల పాలనలో కొంతకాలం ఉంది. అందుచేత విజేత అయిన గూర్ఖారాజు మాకు విధేయులుగా ఉండండి," అని చెక్కించి ఉంటాడు. అతను దేవాలయాన్ని మరమ్మతు చేయించి అక్కడ ప్రజలను పూజ చేయమన్నాడు. అయితే వారు గూర్ఖా ప్రభుత్వాన్ని మాత్రము అంగీకరించాలి. తరువాత గ్వాలియర్ రాజు ఈ దేవాలయాన్ని తిరిగి నిర్మించాడు. జయపూర్ రాజా దాని ఆవరణాన్ని విస్తరింపజేశాడు."

"ఆరాధకులు ఏం పాడుతున్నారు?" అంది దేవయాని. "వారు గంగను పూజిస్తున్నారు. ఆమెను స్తోత్రం చేస్తూపాడే ఇంపైన పాటను వినండి," అన్నాడు తాత.

గంగ దేవాలయం మరీ పెద్దదీ కాకుండా చిన్నదీ కాకుండా సమగ్రంగా ఉన్నది. తెల్లని దేవాలయమూ, దాని పరిశుభ్రమైన ఆవరణా దేవయానికి బాగా నచ్చింది. హారతి చాలా సేపు ఇచ్చారు. ఉన్నతమైన మంచు శిఖరాలూ, జల జలా పారే, మిల మిలా మెరిసే గంగా, కాషాయవస్త్రాలు ధరించిన సాధువులూ, ప్రశాంత పరిసరాలూ, శ్రవణా

నంద కరమైన గీతాలాపనా, గుడిగంటల గణగణలతో కూడిన మనోహర వాతావరణం ఇద్దరు పిల్లల్ని బాగా ఆకర్షించింది.

సూర్యాస్తమయం కాగానే వాతావరణం బాగా చల్లబడింది. అరణ్యంలోని విశ్రాంతి గృహానికి పిల్లల్ని తాత తీసుకొని వెళ్లాడు. వారికి కావలసిన భోజన పదార్థాలు గంగోత్రి దుకాణాలలో కొని తెచ్చాడు. స్టవ్ మీద భోజనం తయారు చేశాడు. ముగ్గురూ తృప్తిగా తిన్నారు.

"తాతా! అన్ని వస్తువులూ ఇక్కడి దుకాణాలలో దొరుకుతాయా?" అంది దేవయాని.

"బాటసారులకు కావలసినవన్నీ దొరుకుతాయి. మనం సెప్టెంబరు నెలలో ఉన్నాం. చాలా కొద్ది రోజులు మాత్రమే బజారు ఉంటుంది. మంచు కురవడం మొదలు పెట్టగానే క్రింది మైదానాలకు అందరూ తరలి వెళ్ళిపోతారు.

"ఇక్కడ ఎవరూ ఉండరా? అందరూ వెళ్లిపోతారా?"

"కొందరు సాధువులు పర్వతాలు వదలి వెళ్లరు. ఈ ప్రదేశమంతా మంచుతో కప్పివున్నా వారు మాత్రం గుహలలోనే ఉంటారు. ఏ దుస్తులూ ధరించరు. చాలా కొద్దిమంది సాధువులే అట్లా ఉంటారు."

"ఇప్పుడే ఈ చలికి గడ్డకట్టుకొని పోతున్నామే - మరి వారెలాగ నిభాయించుకుంటారో, తాతా? అంది దేవయాని.

"ఈ పుణ్యాత్ములకు యోగం" తెలుసు. చలి కాలానికి కావలసిన వంట చెరకును శిష్యులు వారికి గుహలలో ఉంచి పోతారు వాటితో వారు మంటలు వేసుకొని అతి చలిని తట్టుకుంటారు. కింది మైదానాలకు వెళ్లితే వారి తపస్సు భంగమవుతుంది. మరి!"

"అబ్బా! ఈ చలికి తట్టుకోలేం." అంది దేవయాని కంబళిలో తల దూరుస్తూ.

అలసి పోయిన పిల్లల్ని వెంటనే నిద్రాదేవి తన ఒడిలో చేర్చుకుంది. తెల్లవారి నిద్ర లేపుదామని వెళ్లేసరికి ఎక్కడికో అదృశ్యమయ్యారు. మళ్లీ ఏదైనా గుహకు వెళ్ళారనుకున్నా తాతకు పిల్లల మాటలు దాపున వినబడుతున్నాయి. "ఏంచేస్తున్నారు? ఎందుకు ఆ రాళ్ళు ప్రోగు చేస్తున్నారు? అడిగాడు తాత."

"ఈ అందమైన రాళ్లు చూడు! మన ఇంటి దగ్గర ఇలాంటి రాళ్లు లేవు. వీటికి నామ

కరణం చేశాము. ఈ రాతిని "తాత" అంటాం," అంది దేవయాని.

"ఇదేం చిత్రం. ఈ రాళ్లకు మీ తాతకు ఏమి పోలిక వుంది?" అన్నాడు నవ్వుతూ తాత.

"నువ్వు నూలు పోగుల్ని జందెంగా ధరించి నట్లే కనిపిస్తూంది, చూడు!" "అదా - అర్థమైంది. ఆ తెల్ల రాతికి అడ్డంగా గోధుమ రంగు చారఉంది. మీరు మరీ కొంటె వాళ్ల య్యారు."

"ఈ సన్నని రాతిని 'అవ్వ' అని అందాం." ఈ రాళ్లు అన్నింటినీ ఒక పూర్తి కుటుంబం లాగ ప్రోగు చేస్తున్నారు- ఎందుకు?"

"దాని నుదుట తిలకం ఉంది కావాలంటే చూడు. పైనున్న ఈ నల్ల చుక్క కచ్చితంగా బొట్టులాగా లేదా?" తాత పకపకా నవ్వాడు.



“మరి ఇది నీల మణి - ఎంత నీలంగా ఉందో చూడు. ఈ రాళ్లను ఇంటికి తీసికొని వెళతాను.’

“వాటిని మోసుకొని వెళ్లగలిగితే అట్లాగే. నేను మాత్రం కొంచెం గంగా జలాన్ని తీసి కొని వెళ్లతాను. నాతో రండి. ఒక చిత్రమైన రాతిని చూపుతా.”

గంగోత్రి దగ్గర ప్రత్యేకం తెల్లరాళ్లు ఎక్కువ. విల్లూ, బాణాలూ వాటి దాపున ఒక జత పాదుకలూ ఉన్నరాతిని చూపాడు తాత. “రాముని పాదుకలకు భరతుడు విధేయత ప్రక టిస్తూ ఉన్నట్లుంది - ఆ రాతి మీద ముద్రలు చూడండి.”

“ఆదిత్యా! ఆగుహలోకి గంగా జలం ప్రవహిస్తున్నట్లున్నది. గమనించావా? అటుచూడు. అది శివలింగాకారంలో దిగువకు పారుతోంది.”

అరణ్యంలోని విశ్రాంతి గృహానికి తిరిగి రాగానే గోముఖ - యాత్రకై ఏర్పాట్లతో ఊపి రాడకుండా ఉన్నాడు తాత. కొంత దూరం వెళ్లడానికి కంచర గాడిదల యజమానులతో బేరం కుదుర్చుకున్నారు. మిగిలిన దూరాన్ని నున్నటి పెద్ద జారుడు రాళ్లపై నడిచి పోవాలి.

“గోముఖ్ వెళ్లడానికి సిద్ధంగా వున్నారా” అన్నాడు తాత.

“తెల్లవారుతూనే మనం బయలు దేరాలి - జ్ఞాపకం ఉంచుకోండి. పర్వతాల మీద ప్రయాణం చేసేటప్పుడు - మనం వేకువ జామునే లేవాలి.”

“మనం గోముఖ్ రేపుచేరుతామా?” అన్నారు పిల్లలు.

“లేదు. ఈ రాత్రి చీర్వాసాలో గడుపుదాం. మరునాడు గోముఖ్ వెళ్లి ఆ రాత్రికే తిరిగి



చీర్‌వాసా తిరిగి వస్తాము. దారిలో 'భోజ్‌వాసా,' 'పుష్పవాసా' దాటి పోవాలి. కాని అక్కడ మనం మకాం చేయడంలేదు."

"దేవయానీ! భోజన పదార్థాలు నువ్వు చూసుకో, ఎంత ఎక్కువ నడిస్తే అంత ఎక్కువగా ఆకలి వేస్తుంది. ఆకలిని మాత్రం అణచుకోవద్దు. నాజేబులో ఎండు పండ్లూ, పటిక బెల్లమూ వేసికొని దారిలో నములుతూ ఉంటాను. మీరూ అలాగే చెయ్యండి."

"ఎండు పండ్లతోనూ, పటికబెల్లం ముక్కలతోనూ ఇది వరకే మాజేబులు నిండాయి. బిస్కట్ పొట్లాలూ, ఫలహార పదార్థాలూ, జున్ను డబ్బాలూ సంచుల్లో కూరాము. ఎక్కడా గలీజు కాకుండా చూసుకుని ఖాళీడబ్బాలను వదిలి వేస్తాము," అంది ఆదుర్దాగా దేవయాని.

"ఇప్పుడు అసలు సంగతి బైటపడ్డది. మన టిన్నులూ, పాకెట్లూ ఎక్కడున్నాయా అని ఆశ్చర్య పడుతూ ఉన్నాను. ఎండు పళ్ల ఆచూకీ ఎక్కడా అని ఆశ్చర్యపడ్డాను," అని నవ్వుతూ అన్నాడు తాత.

ఆదిత్యా, దేవయానీ అమాయకంగా చూశారు.

"మేమే అడుగుదామనుకున్నాం. నీకు ఆకలి వేసినప్పుడు మా జేబులలోనుంచి కాయలూ అవీ తీసి నీకుఇచ్చి, నిన్ను ఆశ్చర్య పరచాలి అనుకున్నాము."తెలివైన పని" నిత్యం ప్రయాణం చేసేవాళ్లు చేసే పని అదే! వాళ్ళు అవసరానికి అనువుగా తినుబండారాలు దాచుకుంటారు."

"ఆదిత్యా! చీర్‌వాసా అంటే ఏమిటి? ఆపేరు అదేమిటి అలా ఉంది.?" అని గబుక్కున అడిగింది దేవయాని.

తాత కంబళి కప్పుకొని ఆ మాటలు చాటుగా విన్నాడు. వచ్చివారి ప్రక్కన కూర్చున్నాడు.

"మనం పైకి వెళ్లిన కొద్దీ వృక్షజాలంలో మార్పు కనబడుతుంది. కొంత ఎత్తు వరకూ దేవదారూ, తరువాత భూర్జవృక్షాలూ, ఇంకా పైన పొదలూ, పువ్వులూ కనబడుతాయి. ఇంకా పైన గడ్డి మాత్రమే ఉంటుంది. చివరకు రాళ్ళు మాత్రమే ఉంటాయి."

పైన దేవదారు చెట్ల ప్రాంతాన్ని చీర్‌వాసా అనీ, తర్వాత భోజు వృక్షప్రాంతాన్ని భోజ్ వాసా అనీ - పొదలూ, పూలూ ఉన్న తావును పుష్పవాసం అనీ అంటారు."

"గోముఖ్ దాటిన తర్వాత పర్వత ప్రాంతాన్ని తపోవనం లేక ఋషివాసం అంటారు.

రేపు ఉదయం మీరే ఇదంతా స్వయంగా చూస్తారులెండి."

మరువాడు గోముఖం చూడాలని కలలుకంటూ పిల్లలు పెందలాడే లేచారు. తెలతెల వారు తుండగానే కంచర గాడిదల మనుష్యులు రాకముందే దేవయాని ఆహారపదార్థా లన్నీ ఒకచోట తయారుగా ఉంచింది. ఆదిత్య వాటిని పొట్లాలు కట్టాడు.

తాత దారి చూపుతూ ఉంటే పిల్లలు ఆయన వెనుక కొంచెందూరం కంచర గాడిద



లపై బయలు దేరారు. వాటిని తోలేవాళ్ళు వెనకగా ఉన్నారు. పిల్లలకు శ్రమలేకుండా కంచర గాడిదలను తాత బాడుగకు ఏర్పాటు చేశాడు. ఆ దారి చాలా ఇరుకుగా, నడవడా నికి మాత్రమే వీలుగా ఉన్నది. భాగీరథీ నీరు క్రింద మిలమిలా మెరుస్తోంది.

దేవయాని వున్నట్లుండి ఆగి, "తాతా! ఇవాళ నాపుట్టినరోజు. చెప్పడం మరచిపోయా ను అంది."

తాత నేలమీద తన కర్రను తట్టాడు. "ఆగకండి. ముందుకు నడవండి. ఇంటి దగ్గర నీ జన్మదినం జరుపుకోవచ్చు. ఇక్కడ గంగ జన్మదినం పాటిద్దాం."

"గంగపుట్టినరోజు పండుగా? అదెప్పుడు జరుపుదాం?" అన్నారు ఏకకంఠంతో పిల్లలు.

భారతీయ పంచాంగం ప్రకారం లెక్కకట్టారు. పాశ్చాత్యుల కాల మానం వేరుగా ఉంటుంది. భారతీయ, పాశ్చాత్య తేదీలు ఒకేలాగ ఉండవు.

"గంగపుట్టిన రోజు మంచి విందు చేసుకుంటారా?" అంది దేవయాని. "చూడు తాతా! గంగ పుట్టినరోజును గురించి నన్ను ఏమీ అడగనియ్యడం లేదు! దేవయానికి విందులోనే ఆసక్తి," అన్నాడు ఆదిత్య.

"ఇక్కడి వాళ్లు గంగ పుట్టిన రోజును "గంగోత్సవం" అంటారు. అది జూన్ మధ్యలో వస్తుంది. ఆ రోజున గంగలో స్నానం చేయడం శుభం అంటారు - దేవయానీ! ఏదైనా బహుమతి పొందే కంటె ఆ రోజు పేదలకు అన్నం పెట్టడం, దానం చేయడమే ముఖ్యం."

"దానం అంటే ఏమిటి?" అన్నాడు ఆదిత్య.

"దేవుని పేర పేదవానికి నిష్కామంగా ఏదైనా ఈయడం దానమవుతుంది. ఇచ్చిన దానిని గురించి మరి ఆలోచించరు, జ్ఞాపకం కూడా చేసుకోకూడదు."

"విందూ, కానుకలూ లేని పుట్టినరోజు పండుగ ఏమిటి?" అని ఆశ్చర్యంగా అంది దేవయాని.

"సరే! నీకే ఏదో కానుక ఒకటి ఇస్తాను. గంగ దాపున ఇంత అందమైన పరిసరాలలో త్వరలో మరో జన్మదినోత్సవం జరుపుకోగలమా!" అన్నాడు తాత.

"ఇక్కడ ఆగు. గంగకు ఎదురుగా చేతులు జోడించి నిలబడు. ఇట్లా అను. "తల్లీ! గంగా! నాకొకవరం ప్రసాదించు.' దేవయాని అలాగే గంగ వినేటట్లు బిగ్గరగా అంటాను.

తల్లీ గంగా నాకు వరం ప్రసాదించు."

"అబ్బ! అంత బిగ్గరగా అనకూడదు. ఇతరులు వినాలని కొందరు పెద్దగా అరుస్తారు. దేవుని ప్రార్థిస్తూ ఉంటే నీ హృదయంలో, నీలో నీవే అనుకో - "తల్లీ! గంగా! ఈ చక్కని ప్రదేశంలో నా జన్మదినం రావడం నా అదృష్టం. నన్ను ఆశీర్వదించు. నీవు భూమి మీద మాశ్రేయస్సుకై అవతరించి నట్లే, నాకు ఎల్లప్పుడూ ఇతరుల మేలు కోరే బుద్ధిని ప్రసాదించు. మమ్మ మరువవద్దు. అని, ఇప్పుడు వంగి నమస్కరించు. బయలుదేరి వెళదాం. దారిలో మాట్లాడుకుందాం. ఆగడానికి ఇది సమయం కాదు.

"తాతా! చూస్తూ ఉండు. ఈ దేవయాని ఇల్లు చేరగానే అన్ని సదుద్దేశాలూ మరిచి అది కావాలి - ఇది కావాలి అని అవ్వనూ, అమ్మనూ విసిగిస్తుంది," అన్నాడు ఆదిత్య.

"లేదు!లేదు! గంగ జన్మదినోత్సవం ఆచరించి నట్లే నా పుట్టిన రోజు పండుగ జరుపుకుంటాను."

"పేదలకు తిండీ, గుడ్డలూ, దానం చేస్తా. గంగ జన్మదినోత్సవం ఏమిటో ఇంకా నాకు అర్థం కావడం లేదు."

"అయినా, ఎందుకో మరి నాకు తెలియడం లేదు. హస్తానక్షత్రం, బుధవారం నాడు భగీరథుడు గంగా జలాలను దివినుంచి భువికి తెచ్చాడట."

అన్నట్లు -ఈ విషయాన్ని గురించి చెప్పుకుంటున్నాం.

ఒక విషయం అడుగుతాను - "ఈ ప్రదేశాన్ని గంగోత్రి అని ఎందుకు పిలుస్తారు?"

"అది సులువే - నే చెప్పుతాను - విను." అంది దేవయాని. "ముందుకు రండి," అన్నాడు తాత.

"ఇక్కడ గంగ భూమి పై అవతరించింది. దానినే హిందీలో "గంగా ఉతారే" అంటారు."

"బాగున్నది, ఒప్పుకున్నాం: నువ్వు ఏమంటావు. ఆదిత్యా?"

"నాకు ఏమీ తెలియదు."

"నేను ఒక సూచన ఇస్తాను. దానిని అనుసరిస్తే ఈ తావుకు గంగోత్రి అని పేరెలా వచ్చిందో అర్థమవుతుంది," అన్నాడు తాత.

కొంచెం ఆగి, చటుక్కున తాత ఇలా అన్నాడు: "దక్షిణాది వారు గంగోత్రిని దర్శించ డానికి చాలా దూరం యాత్ర చేస్తారు."

"దక్షిణాన, ఉత్తరాన, తూర్పున, పడమట - అన్ని దిక్కులలోనూ కనిపించే గంగను ప్రత్యేకంగా ఉత్తర గంగ అని ఎందుకు పిలుస్తారు?"

"నీవు చురుకైన వాడివి. సరీగ్గా ఆ పేరు అట్లా వచ్చిందే. ఇక్కడ గంగ ఉత్తర దిశగా ప్రవహిస్తూంది కాబట్టి గంగోత్రి అయింది. అంత పై నుంచి ఈ పర్వతాలలో ఉత్తరంగా ప్రవహించడం విశేషమే. దానిని శుభకరం," అంటారు.

"ఎందుకు తాతా?" అని అడ్డు ప్రశ్న వేసింది దేవయాని.

"ఉత్తరానున్న ఉత్తర హిమాలయాల నుంచి నదులు సహజంగా దక్షణాదికి ప్రవహిం స్తాయి. కాని ఆ పారేనీరు మధ్యలో ఉత్తరంగా ప్రవహించడం - తనను తాను క్రిందికి పడ కుండా రక్షించుకోవడం అవుతుంది. ప్రవాహ దిశమార్పులో ఒక సందేశం ఇమిడి ఉంది."

"ఏమిటా సందేశం?" అని తాత వైపుకు మళ్లాడు ఆదిత్య.

"ఆదిత్యా! నీ చూపు భూమివైపుకు మళ్ళించు. లేకుంటే కాలు జారి పడతావు. ఆ సందేశం ఏమంటే - ప్రతి ఒక్కరి లక్ష్యం ఉన్నతంగా ఉండాలి. పతనం కలుగ కుండా ఉండడానికి అది గుర్తు. ఇక్కడ గంగ ఉత్తరంగా పారుతుంది కనుక గంగోత్రి అయింది."

"తాతా! గంగ వివాహాన్ని గురించి పాఠ్యపుస్తకంలో కొంత చదివాను. దాని అర్థం ఏమిటి?" అన్నాడు ఆదిత్య.

"ఎవరితో?" అన్నది దేవయాని.

"శంతను మహారాజుతో."

"శంతను" ఒక రకం ధాన్యమని "గంగోత్రి దర్శనం" అనే పుస్తకంలో చదివాను.

ఆశ్వయుజ మాసంలో ఆ పంటకు వర్షం అవసరం. ఆ నెలలో కురిసే వర్షపు నీటినే గంగా జలం అంటారు. శంతను ధాన్యం గంగా జలంతో సంయోగం వలన పంటలు పుష్క లంగా పండుతాయి. గంగ వివాహం అంటే అదే. మనం గంగ పుట్టిన రోజు, నామకరణం, వివాహం ఏర్పాటు గురించి మాట్లాడుతూనే ధర్మశాల వద్దకు చేరాం," అన్నాడు తాత.

"చీర్వాసా ధర్మశాల వరకే దేవదారు చెట్లు పెరుగుతాయి."

"ఇది మనకు ఉండటానికి అనువైన చోటు," అన్నాడు ఆదిత్య.

"ఇక్కడ రాత్రి గడుపుదాం. చౌకీదారు ఉండడు. అతిథులే అన్ని ఏర్పాట్లూ చేసుకుంటారు, నమ్మకంగా ఉంటారు. ఆదిత్య పరుగెత్తుకొని వెళ్లి తలుపుగొలుసు తీస్తూ "చూడు, తాతా! ఇక్కడ అప్పుడే పాత్రలూ, పెనాలూ, భోజన పదార్థాలూ ఏర్పాటు చేసి ఉన్నాయి," అన్నాడు.

"మన సామాన్లూ, మూటలు విప్పండి. ఇక్కడ ఉన్నవీ, మన సామగ్రీ ఉపయోగించి భోజనం సిద్ధం చేయండి. ఇతర ధర్మశాలల్లో వస్తువులు తరిగి పోతాయి, దొంగతనం జరుగుతుంది. అయితే ఇక్కడ అవి పెరుగుతాయి."

"అదెట్లా సాధ్యం, తాతా?" అన్నాడు ఆదిత్య ఆశ్చర్యంతో.

"ఇక్కడ దిగినవారు కొన్ని పదార్థాలు వదలి వెళ్లడం రివాజు. తరువాత వచ్చిన యాత్రికులు వారికి అవసరమైన వాటిని వాడుకుంటారు. బదులు కొన్ని ఆహార పదార్థాలు వదిలి వెళ్లుతారు. చౌకీదారు గానీ, కాపలా దారు గానీ ఉండరు. ఫలితం, ఆ ధర్మశాలలో పదార్థాలు తరగకపోగా వృద్ధి అవుతాయి. అదే నిజాయితీ అంటే!"

"ధర్మశాలను ఎవరు కట్టారు? అన్నాడు ఆదిత్య. "బాబూ, ఈ కాలంలో జనం పని అంటే శ్రద్ధ చూపరు, పేరు కోసం పెనుగులాడుతారు. ఒకరు ధర్మశాలను సేవా దృష్టితో నిర్మించారు.ఆయన పేరు ఎక్కడా చెక్కించుకోలేదు. పేరు చెక్కించి నట్లయితే అది వారి సొంతం అని సూచిస్తుంది. కానీ ఏపేరు లేక పోతే అది అందరిదీను. అయినా అక్కడా అక్కడా జనం చెప్పుకొనేది - మురాదాబాద్ జిల్లాలోని ఠాకూర్ ద్వారాకు చెందిన సేఠ్ రఘునందన దాసు దీనిని నిర్మించి సకల సౌకర్యాలూ సమకూర్చాడు" అని.

"కంబళ్లు పరుద్దాం. నిప్పురాజేసి ఆహారాన్ని వేడి చేద్దాం, చల్లారిన అన్నం నేను తినలేను," అన్నాడు తాత.

వారు బాగా అలసిపోయారు. ప్రక్క చుట్టలు విప్పి నడుములు వాల్చారో లేదో తేలు కుట్టినట్లు చటుక్కున ఎగిరి పడ్డారు.

"ఏమిటి విషయం?" అని అమాయకంగా అడిగాడు తాత.

"పడకలో విద్యుత్ ప్రవాహం ఉన్నది!" అని వారి జవాబు.

"విద్యుత్ శక్తిని వెనుకనే వదలి వచ్చాం అసలు మీరిక్కడ ఏదైనా విద్యుద్దీపం చూశారా?"

"నిజంగా పక్కచుట్టలో ఏదో ఉన్నది. అదేదో షాక్ కొట్టినట్టు అయిం ది. ఒక సారి కూచొని చూడు!"

"దుప్పట్లు తగలగానే మీరు ఎగిరి గెంతేస్తారని నాకు తెలుసు. అందుకే



ముందు కంబళ్ళు పరచమన్నది. మీరు నా మాట పెడ చెవిని పెట్టారు. ఈ చలిలో నూలు బట్టలు మంచులాగ చల్లబడతాయి. మొదటి సారి నేను ఇక్కడికి వచ్చినప్పుడు నాకు సరీగ్గా ఇదే జరిగింది. ఈ దుప్పట్లపై నేను పరచుకొన్నట్లు మీరూ కంబళ్లు పరచి కూర్చోండి. కంబళ్లు ఎంత ఉపయోగమో తెలిసిందా? అందుకే పర్వత వాసులు గొర్రెల్నీ, మేకల్నీ ఐశ్వర్యంగా భావిస్తారు."

ఆదిత్య కంబళీ పరుస్తూ - "అయితే తాతా, గొర్రెలూ, మేకలూ - లేకుంటే కంబళ్లు ఉండవుగా - వాళ్లకు వెచ్చగా ఉండదు కదా," అన్నాడు.

దేవయాని ఒక కంబళి కప్పుకొని మరొక కంబళిపై సుఖంగా కూర్చుంటూ "ఇప్పుడు నాకు గొర్రెలూ, మేకలూ అంటే కంపుగా, అసహ్యంగా లేదు. ఒక గొర్రె పిల్లను ముద్దుగా పెంచుకుంటాను," అంది.

తెల్లవారు జామున భోజ్‌వాసాకు బయలు దేరారు. రాత్రి కొద్ది మంచు కురియడంతో పొదలపై నున్న మంచు రేకులు చిత్ర విచిత్రంగా కనిపిస్తున్నాయి.

"సముద్ర మట్టానికి ఎంత ఎత్తున ఉన్నాం - తాతా?" అన్నాడు ఆదిత్య.

"గోముఖ్ 13,000 అడుగుల ఎత్తున ఉన్నది," అన్నాడు తాత.

"తాతా! ఎదురుగా ఉన్న పర్వతాలకు పేర్లు వున్నాయా? అన్నది దేవయాని."

"ఔనౌను దారిలో ఉన్నది భృగు శిలా పర్వతం అదిగో, అక్కడ శివలింగ శిఖరం వెనుక ఉన్నది బంగారు సుమేరు పర్వతం. ఇతర పర్వతాలు నీలంగా కనిపిస్తాయి. కాని సుమేరు బంగారం రంగులో మెరుస్తుంది. శివలింగం వెనుక సుమేరు యొక్క ఒక ప్రక్కే కని పిస్తుంది."

'భగవద్గీతలో చెప్పిన ఆ సుమేరు ఇదేనా?" అన్నాడు ఆదిత్య.

"నీకు ఎట్లా తెలుసు? గీత చదివావా?" అంది దేవయాని.

"ఔను, అవ్వగీత పెద్దగా చదువుతూంటే నేను సుమేరు పర్వతాన్ని గురించి విన్నాను."

"నేను విన్నపేర్లనే మళ్లీ అంటున్నా, అదే సుమేరు అని నిర్ధారణగా చెప్పలేము. అయితే అటుచూడు, అదెంత అందంగా ఉందో! కైలాస పర్వతాన్ని మేరు పర్వతం అని

కూడా పిలుస్తారు. అసలు సుమేరు ఏదైతే ఏమి - మనం దాని అందాన్ని చూసి ఆనందిస్తాము."

తాత చటుక్కున ఆగిపోయి, "దారి ఎగుడు దిగుడుగా కోసురాళ్లతో నిండి ఉంది. నా చెయ్యి గట్టిగా పట్టుకో - లేకుంటే నడవడం కష్టం. మొనదేలిన కర్రతో నేను పొడుస్తూ జాగ్రత్తగా ముందుకు అడుగువేయాలి."

దేవయాని చెయ్యి పట్టుకొని ఆదిత్య కర్ర ఊతంతో మెల్లగా నడుస్తూ "ఇది మంచి దారే మరి - ఇప్పుడు దీనికి ఏమి అయింది?" అన్నారు పిల్లలు.

"కొండ మీద నుంచి బ్రహ్మాండమైన మంచు గడ్డదొర్లి పడడంతో ఒక నది ఒడ్డువిరిగి కొట్టుకొనిపోయింది. అందుచేత చాలా మంచూ, పెద్ద పెద్ద మంచు గడ్డలూ పర్వతాల వాలులలో జారడంతో పర్వతాల మీది చెట్లూ, చేమలూ, బండరాళ్లూ అన్నీ ప్రవాహంతో పాటు కొట్టుకొని పోతాయి. అవిధంగా పర్వతాలు హరించుకొని పోతాయి. మార్గాలన్నీ రాళ్లూ, రప్పలతో నిండి, జారుతూ నడవడానికి ఇబ్బందిగా ఉంటాయి. ఒక్కసారి జారితే సరాసరి భగీరథిలోనే పడతాం. అందుకే మీ నడుముల చుట్టు తాడు కడదామని అనుకుంటున్నాను," జారి పడినా పైకి లాగవచ్చును. నదిలో పడిపోరు. అన్నాడు తాత.

"కస్తూరి మృగము ఇక్కడేనా ఉండేది?" అని అడిగింది దేవయాని.

"ఔను, పైన శీతల ప్రాంతాల నుంచి మంచు ఎక్కువగా పడేటప్పుడు అది క్రిందికి దిగివస్తుంది."

"అయితే అది వేడిని తట్టుకోలేదు. నీకు తెలుసా? - ఎలుగ్గొడ్డూ, చిరుతపులీ, మరి పెద్దపులీ మంచు కురవడం మొదలు కాగానే క్రింది పర్వత సానువులకు దిగివస్తాయి."

"ఇతర లేళ్లలాగే ఉంటుందా, కస్తురి మృగం?" అంది దేవయాని.

"అది నల్లగా లేడి కన్నా చిన్నదిగా ఉంటుంది."

కొండరాతిపై కాలుజారి పడడం చేత దేవయాని పాదానికి దెబ్బతగిలి రక్తం కారసాగింది.

"ఇప్పుడేం చేద్దాం?" అని ఆదుర్దాగా అడిగాడు ఆదిత్య.

"ఇక్కడ స్థానికులు చేసినట్లే చేద్దాం. ఆ పరిసరాలచుట్టూ వెతికి వెతికి ఆఖరికి ఒక



మొక్కను వ్రేళ్లతో పీకాడు తాత. ఆ వ్రేళ్లను మొత్తగా నూరి ముద్ద చేసి దేవయాని గాయానికి వేసి కట్టుకట్టాడు.

"దీనితో దేవయాని గాయం నయమవుతుందా?" అని, ఆశ్చర్యంగా అడిగాడు ఆదిత్య. "తప్పకుండా నయమవుతుంది. ఇక్కడ వైద్యశాల లుండవు. ఓషధుల నుంచే మందులు తయారుచేసుకుంటారు. ఆ మొక్కను "ఆర్చ" అంటారు."

దారిన నడుస్తూ తాత మరొక మొక్క ఆకు త్రుంచి దానిని నలిపి ఆదిత్యనోట్లో పెట్టాడు. "దీని రుచి ఎట్లా ఉంది?"

"పంచదారలా తియ్యగా ఉంది తాతా."

"అదే వీళ్లకు పంచదార. కొందరు సాధువులు ఆ ఆకుల్ని ఎండ బెట్టి పొడి చేసుకుం



టారు. ఆకుల్ని కాలిస్తే అక్కడి గాలి అంతా సువాసనతో నిండి పోతుంది. సాధువులు అద్భుతాలు చేయగలరని ప్రజల నమ్మకం. తీపి వాసన కూడా పంచదారలాగ ఉంటుంది."

తాత ఇంకా కాస్త ముందుకు నడిచి ఇలా అన్నాడు, "ఇటురండి, ఈ మొక్కను చూడండి. ఈ మొక్కల నుంచి వందల కొద్ది పసుపు పచ్చ పూలు పూస్తాయి. ఈ మొక్క ఒక్కొక్కప్పుడు ఏడుస్తుంది.!"

"ఏడుస్తుందా?" అన్నారు పిల్లలు ఆశ్చర్యంగా

"అంత అందమైన చోట ఎవరు ఏడవాలనుకుంటారు?" అన్నారు పిల్లలు వింతగా.

"నిజంగా ఏడవదు. సెప్టెంబరు ముగింపుకు వచ్చింది. మంచు కురిసేకాలం. అయితే



చలి తక్కువగా ఉన్నప్పుడు చెట్టు బోదె నుంచి ఒక రకం రసం ఊరుతుంది. దాని తియ్యదనం చీమల్ని ఆకర్షిస్తుంది. అది చూసి జనం ఆ చెట్టు విలపిస్తుందని అంటారు. దానిని "రుదంతి" (హిందీలో ఏడ్చేది అని అర్థం.) అని అపభ్రంశమైన పదంగా వాడుతారు. దాని అసలు పేరు "రుద్రవంతి" అది ఒక ముఖ్యమైన ఓషధి మొక్క. ఈ ప్రదేశమంతా ఓషధి మొక్కల మయం. ఈ ఆకు పచ్చని పొదను చూడండి. ఇది ఎండు కట్టెలాగ గన గన మండి మనోహరమైన పరిమళాన్ని ఇస్తుంది. అరే, మీకు ఇంకా 'గంగతులసి'ని గురించి చెప్పనే లేదు!"

గంగ తులసి వాసనచూస్తూ వాళ్లను కూడా "వాసన చూడండి," అన్నాడు తాత.

దేవయాని దానిని వాసన చూసి, "భలే వాసన! ఆ ఆకులు మన ఇంటి దగ్గర ఉండే తులసి ఆకుల లాగనే ఉన్నాయి," అంది. "అది ఏడాది పొడుగునా ఆకు పచ్చగానే ఉంటుందని అంటారు. విజ్ఞాన సర్వస్వంలో దీనిపేరు "చామరావతి" అని ఉంది" అన్నాడు తాత.

"తాతా! భాగీరథీకి అవతలి ప్రక్క నున్న కుటీరం ఎవరిది?" పుచ్చకాయల పొలాల్లో రైతులు వేసుకొన్న పూరిళ్ల లాగ ఉంది," అంది

"అందులో ఒక సాధువు ఉంటాడు," అన్నాడు తాత.

"మంచు పడేప్పుడు అతను చలికి వణికి పోడా?"

"నిశ్శబ్దతా, ప్రశాంతతా వారు కోరుతారు. ఇంకేమీ వారు లక్ష్యపెట్టరు," అన్నాడు ఆదిత్య.

"అతను పొదల్లోనించి కట్టెలను ప్రోగుచేశాడు, నేను రాత్రి నిద్రనుంచి మేల్కొనే టప్పటికి వాటిలోంచి చిన్నగా కాంతి ప్రసరిస్తూ ఉంది." మరుసటి ఉదయం ఆయన్ని "ఈ పొదలెక్కడున్నాయని" అడిగాను. ఆయన ఇలా అన్నాడు, "నేను అంతా తిరిగి కొన్ని మొక్కలను అక్కడక్కడా ఏరు కొంటాను. ఏ మొక్క ఎక్కడిదో ప్రత్యేకంగా చెప్పలేను. ఒక పొద నుంచి ఒక రకమైన ద్రవం ఊరుతుంది. అది రాత్రిపూట నీలి వెలుగు అందిస్తుం ది. ఆ ద్రవం ఎండి పోతే వెలుగు ఆగి పోతుంది," అన్నాడు తాత.

"రాత్రి పూట వెలుగు నిచ్చే మొక్కను నేను చూడాలి తాతా!" అన్నది దేవయాని.

"ఈ ప్రాంతమంతా ముఖ్యమైన ఓషధి చెట్లతో నిండి ఉంటుంది. నాకు వాటిపేర్లు కూడా తెలియవు. నీవు పెద్ద దానవు అయిన తర్వాత వాటి మీద కొంత పరిశోధన చేయ వచ్చును. వెలుతురిచ్చే మొక్కల్ని వెతకడానికి వెడితే, మనం గోముఖ్ ఎప్పటికీ చేరలే ము. చూడు మనం భోజవృక్ష పొదల దగ్గరకు వచ్చాం."

ఆదిత్యుడు వంగి పలచని గోధుమ రంగు కాయితములాంటి భోజ వృక్షపు బెరడును చూసి, "ఇదెంత సున్నిగా, మృదువుగా, మెత్తటి వస్త్రము లాగ ఉన్నదో," అన్నాడు.

"అది చక్కని పోలిక, మీరు గుడ్డల దుకాణాల్లో చుట్టిన తాను చూశారు కదా. ఆరీతి గానే భోజ చెట్టు బెరడు దాని మ్రాన్ని చుట్టూ గుండ్రంగా చుట్టుకొని ఉంటుంది. మొదటి పొరను జాగ్రత్తగా ఒలవండి."

"చూడు తాతా! నేను ఒక పొర ఒలిస్తే దాని క్రింద మరొక పొర ఉన్నది...ఆ రకంగా చాలా పొరలున్నాయి...మీరు పైపొరగుండా లోతుగా గాటుపెడితే పొరలు అన్నీ తెగుతా యి," అన్నాడు ఆదిత్య.

దేవయాని మాట మధ్యలో అందుకొని, "తాతా! రాముడు, సీత, లక్ష్మణుడు వన వాసం చేస్తూన్నప్పుడు ఎటువంటి బట్టలను వేసుకుని ఉంటారో నాకర్థమైంది. వెడల్ప యిన భూర్జ పత్రాలతో చీర కట్టుకో వచ్చును అవునా?" అంది.

భూర్జ వృక్షం బెరడును 'భోజ పత్రము' అంటారు.

దాని మీద టైపు చేసిన అక్షరాలు కూడా అందంగా, స్పష్టంగా ఉంటాయి. దానికి చెదలు పట్టవు కూడా!"

"ముద్రణా యంత్రాలు రాక ముందు మన పురాణ గ్రంధాలు భూర్జ పత్రాలపైనే వ్రాయ బడేవి. ఇంకా భూర్జ పత్రాలతో ఏమి చేస్తారో చెప్పండి," అన్నాడు తాత.

"వాటిని ఉతక వచ్చునా?" అంది దేవయాని. "ఆ అవి చాలా గట్టిగా ఉంటాయి. గట్టిగా లాగితే తప్ప అవి చిరగవు" - అన్నాడు తాత.

"అయితే తాతా నేను అరిటాకు మీద తిన్నట్లే భోజ పత్రం మీద భోజనం చేస్తాను. తరువాత దాన్ని శుభ్రం చేసి మళ్లీ వాడుకునేందుకు సంచిలో పెట్టుకొంటాను. నాకిది ఎప్పటికీ పనికి వచ్చేలాగ ఉపయోగిస్తాను," అంది దేవయాని.



"ఇక్కడి వారు ఇలాగే చేస్తారు. పైగా అది వారికి చాలా పవిత్రమైంది. అయితే మీరు ఇంట్లో నెయ్యి ఎక్కడ దాస్తారు!" అన్నాడు తాత.

"సీసాల్లో! డబ్బాల్లో" అని సమాధానమిచ్చారు పిల్లలు.

"అవును! భోజ పత్రాలతో నెయ్యి నింపుకొనే పాత్ర తయారు చేస్తారు."

కొండల్లో నెయ్యి గట్టిగా గడ్డ కడుతుంది. మీరు దాన్ని భోజ పత్రంతో చుట్టి జేబులో పెట్టుకోవచ్చుకూడా. గడ్డకట్టిన నెయ్యి వల్ల గుడ్డలకు జిడ్డు అయి మరకలు కావు. ఇది నున్నగా ఉంటుంది కాబట్టి దానిని ప్లాస్టిక్ లాగ ఉపయోగించవచ్చును. సాధువుల కుటీరాల పై వున్న రంధ్రాలను ఈ బెరడుతో ప్లాస్టిక్ కాగితాలు లాగనే కప్పుపైన కప్పవచ్చును." అన్నాడు తాత.

భోజ పత్రం గుడ్డగా, పళ్లెముగా, ప్లాస్టిక్ పట్టగా ఇంకెన్నో విధాల ఉపయోగపడుతుంది. ఎంత చిత్రం! ఇదెంత అద్భుతమైన వృక్షం!" అన్నారు పిల్లలు.

"నెయ్యి సంగతి మాట్లాడుతుంటే పకోడీలూ, హల్వాగుర్తుకు వస్తున్నాయి" అంది

దేవయాని ఆశగా.

"యాత్రల్లో దొరకని పకోడీలు, జిలేబీలు, హల్వా బదులు మీ జేబుల్లో చేతులు పోనిచ్చి పప్పులు, మర మరాలు. ఖర్జూరాలూ తింటూ అవే జిలేబీలు, హల్వా అనుకోండి. అదే యాత్రికులకు మొదటి నియమము," అన్నాడు తాత నవ్వుతూ.

"ఎందుకు తాతా?" అన్నది దేవయాని.

"మీరు గోముఖ్‌కు పోతూ అవ్వ చేసిన పకోడీలను గురించి ఆలోచిస్తూ ఉంటే మీ కళ్ళముందు అవ్వ బూరెల మూకుడు కనబడుతుంది. మీరు గంగ పుట్టిన చోటుకు వెళ్ళి చూసినా గానీ, మీకు హల్వా, పకోడీలే కనబడతాయి," అన్నాడు తాత. ఆదిత్య గట్టిగానవ్వాడు.

తాత సంస్కృత శ్లోకాలు పఠిస్తూ మధ్యలో ఆగి, "చూడు అందమైన తెల్లటి భోజ వృక్షాన్ని."

"అది నిజంగా ఎంత అందంగా ఉందో. ఇటుచూడు, ఆ చెట్టు మీద ఎవరో యాత్రికుడు తన పేరు చెక్కాడు. దానితో మ్రాను మీది పొరలన్నీ చెడిపోయాయి" అన్నాడు ఆదిత్య.

"ఈ అందమైన పరిసరాలు చూస్తే ఉత్సాహం పెరుగుతుంది. ప్రకృతి ప్రసాదించిన ఈ వరాలను అందరూ గౌరవించాలి. ఒక పొదకు కాని, చెట్టునకు గాని హాని చేయడం ద్రోహం అనిపిస్తుంది. ఇంక ఈవిషయం మీద తర్జన భర్జన కట్టి పెడదాము. చూడు - అదే పుష్పవాన్ - ఇక్కడ చెట్లు వుండవు. కేవలం పూల మొక్కలే ఉంటాయి," అన్నాడు తాత.

"తాతా! దారి మరీ ఇరుకుగా అవుతూ ఉంది" అన్నాడు ఆదిత్య.

"ఇక్కడ భాగీరథీ వెడల్పు తగ్గింది. ప్రవాహ వేగం ఎక్కువైంది. చూడు, దగ్గరలోనే దీని పుట్టుక స్థానం ఉంది అంటే నమ్మలేకుండా ఉన్నాము. ఒకసారి నేను నర్మదానది పుట్టిన చోటు చూశాను. మెల్ల తరబడి ఉపనదులు ఏవీ కలవకుండా అది ఒక్కటే అతి వేగంగా ప్రవహిస్తుంది," అన్నాడు తాత.

దేవయాని నది వైపు చూపిస్తూ "చూడు - నీటిమీద తేలుతూ ఉన్న పెద్ద పెద్ద మంచు గడ్డలు! ఆ పైన ఉన్న ప్రవాహన్ని చూస్తుంటే అక్కడ పెద్ద మంచు పొర, దాని క్రింద అతి వేగంగా ప్రవహించే నీరూ ఉన్నట్లు కనిపిస్తూ ఉంది. తాతయ్యా! భాగీరథి

ఎక్కడ పుట్టింది?" "భాగీరథి ఒక మైలు వెడల్పు ఉన్న పెద్ద హిమానీ నదం క్రింద నుంచి వెలువడుతుంది. మంచు క్రింద నుంచి ప్రవహిస్తుంది. మనం దాన్ని గోముఖం దగ్గర స్పష్టంగా చూడ గలుగుతాము."

"తాతయ్యా! దాన్ని గోముఖ్ అని ఎందుకు పిలుస్తారు, ఆవుముఖాన్ని పోలి ఉంటుందా?" ఆఁ! నిజమే! భాగీరథి పుట్టిన చోటు అచ్చంగా తెరుచుకున్న ఆవునోరు లాగే కనిపిస్తూ ఉంది," అంది దేవయాని.

"అవును. ఆవునోటి మధ్య నుంచి నది జారుతూ ఉన్నట్లు కనిపిస్తుంది. మొట్టమొదట మంచు తెల్లగా ఉంటుంది. క్రమంగా ఆవు పెదవుల లాగ నీలంగా కనబడుతుంది."

"అందుచేతనే దాన్ని గోముఖం అంటారు?" అన్నది దేవయాని. తాతయ్య వివరించాడు: "గౌః అనేది సంస్కృత పదం. దాని కనేక అర్థాలున్నాయి. ఇంద్రియాలనీ, భూమి అనీ, ఎద్దు అనీ ఇంకా ఎన్నో అర్థాలున్నాయి. గోముఖంకు ఈ మూడు అర్థాలు సరిపోతాయి. మొదటి అర్థం ప్రకారం గోముఖం దగ్గర మనం గంగను చూడగలుగు తున్నాము. ఇక్కడ నది భూమి అంతరాళంలోంచి బయటికి వచ్చి, మంచు క్రింద నుంచి ప్రవహిస్తూ మన దృష్టికి గోచరము అవుతుంది."

ఆదిత్య కలుగ జేసుకొని "రెండవ అర్థం నేను వివరిస్తాను. 'గో' అంటే భూమి. గోముఖం అంటే గంగ భూమి మీద ప్రప్రథమంగా కనుపించిన చోటు."

"ఔను అదే నిజం" అన్నాడు తాత.

'గో' అంటే ఆవు అని అర్థం కదా. తాతయ్యా! ఇది వరకే గంగ బయలుదేరే చోటు ఆవునోరులాగ ఉంటుందని అన్నాడు అంది" దేవయాని.

"మీరిద్దరు చర్చించుకుంటూ గోముఖం దగ్గరకే వచ్చేశారు. అది ఆవునోరులాగ కనబడడం లేదా? కానీ, అది ఎప్పుడూ ఒకేలా ఉండదు. అది పెద్ద మంచు గడ్డ మాత్రమే. దాని ఆకారం క్షణం క్షణమూ మారుతూనే ఉంటుంది."

ఆదిత్య అన్నాడు, "తాతయ్యా! గోముఖం మాత్రమే కాదు మారేది. నదీ ప్రవాహ మార్గమంతా కూడా మారుతూనే ఉంటూ, వర్షాలు పడుతున్నా, మంచు కురుస్తున్నా,

మంచు పెళ్లలు విరిగి పడుతున్నా, చెట్ల వ్రేళ్లతో కూలి పడుతున్నా కలిగే మార్పు అది - కదా!"

తాతయ్యా! "చూడు ప్రవాహము ఎంతవేగంగా ఉందో! ఇది దేవప్రయాగ వరకు ఇలాగే ఉంటుంది. మలుపుతిరిగి నప్పుడు అంతా అది ఒడ్డును ఒర కోసుకుని పోతూ ఉంటుంది."

ఆదిత్య గంగ నీరు నింపుకోవటానికి తెచ్చిన పాత్రను తనభుజాన వ్రేలాడుతూఉన్న సంచినుంచి తీశాడు. "తాతయ్యా! గంగనీరు ఎప్పుడూ పరిశుద్ధంగా ఉంటుందంటారు. ఎందుచేత?" అని అడిగాడు.

ఆదిత్య చేతిలోని నీటి పాత్ర తీసికొని తాతయ్య "అనేక మంచు ప్రవాహములు వచ్చి గంగోత్రిగా కలిసి పోయాయి. అనేక ఖనిజ లవణాలూ, ఇతర కణాలూ గంగనీటిని పరిశుద్ధంగా ఉంచుతాయి..." అని తాను విన్న సంగతి వివరించాడు. ఈ అద్భుతానికి ఇంకా అలాంటి వివరణలు అనేకం ఉండవచ్చు."

వాళ్లంతా దిగ్భ్రాంతులై చేతులు జోడించి భాగీరథీ నది అపరిమిత వేగంతో పరుగులు పెట్టే మంచు లాంటి నీటిని చూస్తూ ఉండి పోయారు. అది తుంపర్లు ఎగజిమ్ముతూ సుళ్లు తిరుగుతూ మంచు గడ్డల్ని మోసుకుంటూ పోతూంది.

తాత అప్రయత్నంగానే రెండు చేతులూజోడించి "గంగా మాతకు జై" అని మెల్లిగా అన్నాడు.

"తాతయ్యా! నువ్వు భగీరథుని గురించి చెపుతానన్నావుగా?" అని అడిగాడు ఆదిత్య.

తాతయ్య ప్రారంభించాడు: "ఒక కథ ఉంది. భాగీరధుడు ఎంతో కాలం గంగను ఆమె నిలయము నుంచి తేవడానికై తపస్సు చేశాడు. శివుడే కనక గంగను తనజటాజూటం మీద ఆపకపోయి ఉంటే గంగా ప్రవాహం భూమిని పాతాళానికి త్రొక్కేసేది. శివలింగ పర్వత పంక్తులు, శివుని జడల లాగ విస్తరించుకుని ఉంటాయి. ఎగుడు దిగుడుగా ఉన్న పర్వత పంక్తులు గంగను వారించక పోయి ఉంటే అది సరాసరి మైదానాల గుండా ప్రవహించి విధ్వంసకాండ జరిపేది." తాత కొంచెము ఆగి "మళ్ళీ మనం మాట్లాడుకుంటూ కూర్చుందామా, గంగలో స్నానం చేద్దామా?" అన్నాడు. "నా మటుకు నేను

అయితే బండల మధ్య ఉన్న మడుగులో స్నానం చేస్తాను," అన్నాడు.

"మేము స్నానం ఎలాగ చెయ్యాలి?" మడుగులో నీరు గడ్డకట్టి ఉంది కదా! అని దేవయాని అడిగింది.

"చూస్తూ ఉండండి." అని తాతయ్య ఒక రాతిని మంచు గడ్డపైకి విసిరాడు. మంచు గడ్డ పగిలి అడుగున ఉన్ననీరు బయటకు కనిపించింది. తాతయ్య బట్టలు విడిచి "హర హరగంగే" అని అంటూ నీటిలోకి దూకి ఒక్క మునుగు మునిగి ఒడ్డుకు వచ్చాడు.

దేవయానీ, ఆదిత్యా తాతయ్య లాగనే చేద్దామని అనుకున్నారు.



"ఆగండి, నన్ను మీతో రానీయండి. లేకుంటే మీరు యీ చలికి గడ్డకట్టుకు పోతారు."

వాళ్ళిద్దరూ తాత సహాయంతో ఒక్కసారి మునిగి లేచి చటుక్కున బయటకు వచ్చారు.

"తాతయ్యా! నిజంగా గడ్డకట్టుకొనే పోయాము."

కాని ఇప్పుడు కొంచెం తేరుకొన్నాము," అన్నాడు ఆదిత్య.

"నేను పొడి గుడ్డలు కట్టుకోను," అంది దేవయాని.

"కాదు, కాదు - వెంటనే కట్టుకో లేకుంటే జబ్బు చేస్తుంది.

మీరు చేదు కషాయం త్రాగవలసి వస్తుంది," అన్నాడు తాతయ్య.

వాళ్లు బట్టలు వేసుకున్న తరువాత భాగీరథి దగ్గర ఎత్తుగా ఉన్న పర్వతం వైపు వెళ్ళారు.



"మళ్లీ మనకు ఇలాంటి అవకాశం ఎప్పుడు కలుగుతుందో చెప్పలేను. రండి, గంగను ప్రార్థించండి," అన్నాడు తాత. తాత వాళ్లు తెచ్చిన పాలను గంగమీద అభిషేకం చేశాడు. పూలను చల్లాడు. "గంగకు హారతి ఇద్దాం," అని పిల్లలతో అన్నాడు.

"తాతా! కర్పూరం, అగ్గిపెట్టె తేలేదు, నీవు ఇంటి దగ్గర మర్చిపోయావా!" అన్నది దేవయాని ఆత్రంగా. ఆమాట పూర్తి చేయకమునుపే తాత గరిక క్రింద ఉన్న రెండు రాతి ముక్కలను తీసి, ఒక దాని మీద ఒకటి కొట్టి నిప్పు పుట్టించాడు. ఆ రవ్వలతో ఎండుగడ్డి అంటించాడు. అలా హారతి ఇస్తూ తాతయ్య గంగను ఒక మంత్రంతో స్తుతించాడు. పిల్లలు ఆయనతో శ్రుతి కలిపారు:

"గంగా మాతా నమో నమో!
అందరి ప్రస్తుతి కొనుమమ్మా!
దీవింపుము మము దేవీ గంగ!
పావన గంగా! ఈ జన్మములో
పావనగంగా! మరు జన్మములో."



Lasertypeset at UNIQUE Graphics 2/3 Old Rajinder Nagar, New Delhi - 110060 and printed at JJ Offset Printers, 7 Press Area, Wazirpur, Delhi - 110035

